ఆగస్ట్ 2002  Rs. 10/-

# చందమామ

మధ్య పేజీలలో..

పిల్లల సృజనాత్మక శక్తికి పనికల్పించే ఒంటికొమ్ము ఖడ్గమృగం కానుక!



# సుగంధ పరిమళాల మార్గంలో...

చిన్నారి చందన గంధపు వృక్షం కొమ్మమీద కూర్చుని కాస్సేపు చుట్టుపక్కల కలయజూసింది. ఆ తరువాతపక్కనే ఉన్న ఒక రెమ్మను అందుకుని అందులోని ఆకులను తుంచి వాసన చూసి, "ఛ! నువ్వు గంధపు వృక్షం కాదు. నీ ఆకుల్లో సువాసన లేదు. నన్ను నువ్వువెర్రిదాన్ని చేయడానికిచూస్తున్నావు!" అన్నది.

"హహహ!" అని నవ్విన గంధపు వృక్షం, "నా సువాసన నా ఆకుల్లో లేదు. మరెక్కడున్నదో చెప్పుకో చూద్దాం!" అన్నది.

"బోదెలోనా? గింజల్లోనా? పళ్ళల్లోనా?" అని అడిగింది చందన అనుమానంగా.

"ఆహా హా!" అని వృక్షం మళ్ళీ గట్టిగా నవ్వి, "కాదు, కాదు, కాదు! అది నా లోపలి చెక్కలో ఉంటుంది. వేళ్ళల్లో ఉంటుంది. బెరడులోగాని, వెలుపలి చెక్కలోగాని ఉండదు. బెరడు కప్పబడిన లోపలి చెక్కలో మాత్రమే ఉంటుందన్నమాట. గుర్తుంచుకో. నా వేళ్ళలో నూనెఎక్కువగా ఉంటుంది. అందువల్లేగంధపు చెట్లను మొద లంట నరకరు. వేళ్ళు వృధా కాకుండా ఉండడం కోసం సమూలంగా పెకలిస్తారు.



ఘాటైన సువాసన కలిగిన లేత పసుపుపచ్చ ద్రవం చందనం నూనె. దాని సువాసన చాలాసేపు ఉంటుంది. 'శాంథలాల్' అనే మద్య సంబంధ మైన రసాయనికి పదార్థం అందులో ఉంటుంది. శాంథలాల్ ఉన్న శాతానికి అనుగుణంగానే దాని సువాసనా, ఔషధగుణం ఉంటాయి. శ్రేష్ఠమైన చందనం నూనెలో 90 శాతం శాంథలాల్ ఉంటుంది.



మైసూర్ శాండల్ సంస్థ గత 80 సంవత్సరాలకు పైగా చందనం శ్రేష్ఠతను మీ ఇళ్ళల్లోకి తీసుకువస్తోంది.







## గంధపు చెక్కను గురించి తెలుసుకుందాం

కింది వాక్యాలలో ఏవి సరైనవో, ఏవి కావో చెప్పగలరా?

1. అత్తరులు తయారుచేయడానికి సహజ వాసన ద్రవ్యాలు కలిపిన గులాబి, మల్లెల నూనెలతో పాటు చందనం నూనెను ఉపయోగిస్తారు.
2. ఐస్‌క్రీమ్‌లాంటి ఆహారపదార్థాలలో చందనం నూనె కలుపుతారు.
3. జ్వరం, తలనొప్పి తగ్గడానికి నుదుటిపై చందనం పట్టు వేస్తారు.
4. తూర్పు భారతదేశం, పసిఫిక్, ఆస్ట్రేలియా ఈ మూడురకాల గంధపుచెక్కలు మార్కెట్లో లభిస్తున్నాయి.

సమాధానాలు
2 వ అంశం మాత్రమే సరైనది కాదు.
















# Heroes start early.

Ride, race, take a tumble or even take a fall.
Because it's never too early to be a hero.



# భూగర్భంలో మనోహర దృశ్యాలు

ఆదిమ మానవుడు కొండ గుహలలో నివసించేవాడు. కొండలలోనే కాదు; భూగర్భంలో కూడా గుహలు ఉంటాయి. మనుషులు ప్రవేశించడానికి వీలయినంత విశాలంగా భూమిలోపల సహజసిద్ధంగా ఏర్పడిన ఖాళీ ప్రదేశాలు గుహలు. అలాంటి గుహలను గురించి మరిన్ని విశేషాలను తెలుసుకుందాం.

ఆంధ్రప్రదేశ్ కర్నూలు జిల్లాలోని బెలుం గుహలను ఒకసారి సందర్శించి వద్దాం రండి. బిలం అంటే గుహ అని అర్థం. బిలం అన్నమాటే కాలక్రమంలో బెలుంగా రూపాంతరం చెందిందని చెబుతారు. భారతదేశంలో సమతల మైదానాలలో ఏర్పడిన చాలా పొడవైన గుహల సముదాయం ఇదే. ఇది దాదాపు 3కి.మీ. పొడవు ఉంటుంది. అందులో 2కి.మీ. దూరంవరకు సులభంగా వెళ్ళి రావచ్చు. ఒక గుహ మరొక గుహతో కలిసి ఉండడంవల్ల ఒకే చోట చాలా పొడవైన గుహ ఏర్పడిందన్నమాట!

బెలుం గుహలలో పొడవాటి మార్గాలు, ఉన్నట్టుండి విశాలమైన మంటపాలలోకి దారితీస్తాయి. అక్కడక్కడ మంచినీటి చెలమలు, తూములు ఉన్న విశాలప్రదేశాల పైకప్పుల నుంచి చిత్ర విచిత్రాకారాలతో 'స్టాలక్టైట్స్' అనే అద్భుతమైన స్ఫటికలింగాలు వేలాడుతూ కనిపిస్తాయి. గుహ నేల మీద కూడా రకరకాల 'స్టాలగ్మైట్స్' అనే సున్నపురాళ్ళ ఆకృతులు కనిపిస్తాయి.

నీటితో నిండిన బొగ్గుపులుసువాయువు గుహలోని సున్నపురాతిని కరిగించినప్పుడు, అది పైకప్పు నుంచి కిందికి మెల్ల మెల్లగా జారుతుంది. దాంతోపాటు ఉన్న ఖనిజాలతో కలిసి వివిధ ఆకారాల స్ఫటికలింగాలు ఏర్పడతాయి. పైకప్పునుంచి ఈ ఖనిజాలతో కలిసినసున్నపు నీరు నేలపైబొట్లుబొట్లుగా పడడంవల్ల కాలక్రమంలో చిన్న చిన్న స్ఫటికలింగాలు ఏర్పడతాయి.

ఆంధ్రప్రదేశ్ పర్యాటకాభివృద్ధి సంస్థ (టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్) బెలుం గుహలను అందమైన పర్యాటక ప్రదేశంగా అభివృద్ధి చేసింది. పర్యాటకాభివృద్ధి సంస్థ గుహల లోపలి మురికినీటిని తొలగించి, మార్గాలు ఏర్పరచి, సుందర దృశ్యాలు కనిపించేలా వెలుతురును ఏర్పాటు చేసింది. లోపలి గుహలలోకి ఎల్లప్పుడూ నిర్మల వాయువులు వీచేలా ఏర్పాటు చేసింది.

అదిగో ఆ మెట్లగుండా ఇప్పుడు బెలుం గుహలలోకి ఒకసారి వెళ్ళివద్దాం, రండి!

ఇదిగో ఇప్పుడు సింహద్వారం గుండా మొదటి మంటపాన్ని చేరుకుంటాం. ఇందులో చిన్నదే అయినా చాలా అందమైన కొలను ఉంది. చిన్న జలపాతం, నీటిబుగ్గ ఉన్నాయి. ఇది ఈ గుహలలోని చాలా పెద్ద మంటపం అన్నమాట. దీని కప్పు ఎత్తు 9 మీటర్లు.

అదిగో భూగర్భంలోని మరొకమంటపం. అక్కడ కూడా చాలా చిత్ర విచిత్ర ఆకృతులతో స్ఫటికలింగాలు ఏర్పడి ఉన్నాయి. అక్కడి నుంచి మరికాస్త ముందుకు వెళితే పాతాళగంగ మంటపాన్ని చేరుకుంటాం. అక్కడ ఒక చిన్న జలపాతం ఉంది.

గుహ ఉపరితలం కొన్నిచోట్ల 20మీ.ఎత్తు కూడా ఉంటుంది. లోపలి గుహలలో ఒక లోతైన చార కప్పుగుండా వెళుతుంది. ఆ చార అందాన్ని మరింత పెంచడానికి దానికి దీపాలంకరణచేసి ఉన్నారు.

ఇక వలయాకారంగా ఉన్న మెట్లగుండా వెళితే, స్ఫటికలింగాలు అసంఖ్యాకంగా ఉన్న కోటిలింగాల మంటపాన్ని చేరుకుంటాం. చిన్న పరిమాణంలో హిమాలయ సానువులు తల్లకిందులుగా వేళ్ళాడుతున్నట్టు

## ఆంధ్రప్రదేశ్ టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్

**వివరాలకు సంప్రదించండి**: డివిజనల్ ఆఫీస్ ఎపిటిడిసి, 6, సి క్యాంప్ నంద్యాల రోడ్, **కర్నూలు**. ఫోన్ 08518 70104 లేదా సెంట్రల్ రిజర్వేషన్ ఆఫీసస్ **హైదరాబాద్**, ట్యాంక్‌బండ్ రోడ్ ఫోన్: 040-345 3036,3450165, ఫ్యాక్స్ 040-345 3086. **సికిందరాబాద్**: యాత్రినివాస్, ఎస్.పి.రోడ్ ఫోన్: 040 7893100, 7816375; **విశాఖపట్నం**: ఎల్.ఐ.సి బిల్డింగ్, డాబా గార్డెన్ ఫోన్ 0891 713 135, **విజయవాడ**: హోటల్ ఇలాపురం కాంప్లెక్స్, గాంధీనగర్ ఫోన్:0866-570 255, రైల్వేస్టేషన్‌వద్ద ఇన్ఫర్మేషన్ కౌంటర్; ఇన్ఫర్మేషన్ అండ్ రిజర్వేషన్ కౌంటర్ ఎపి ఎస్ ఆర్ టి సి, పండిట్ నెహ్రూ బస్‌స్టేషన్ ఫోన్: 0866 -523966; **తిరుపతి**: టి.పి. ఏరియా వెంకటేశ్వరా బస్‌స్టేషన్ పక్కన, ఫోన్:08574- 55385 డివిజనల్ ఆఫీస్: కేర్ఆఫ్ 6, సి క్యాంప్, నంద్యాలరోడ్ **కర్నూలు** ఫోన్:+91(8518) 70104 ఫ్యాక్స్ 33722 **బెంగుళూరు**: టూరిస్ట్ ఇన్ఫర్మేషన్ సెంటర్, కేర్ఆఫ్ ఐటిడిసి యూనిట్ అశోకా ట్రావెల్స్ అండ్ టూర్స్, రేస్‌కోర్స్ రోడ్, **బెంగుళూరు**-560001, ఫోన్080-238 3361, 238 3362, ఫ్యాక్స్ 080-238 3363



# బెలుం గుహలు
## ఓ ప్రకృతి అద్భుతం!

ఇక్కడి ఆకృతులు కనిపిస్తాయి. ఇవి వివిధవర్ణాలలో ఉన్నాయి. వాటిలోని ఖనిజపదార్థాలే అందుకు కారణం.

లక్షల సంవత్సరాలనాటి ఈ ప్రాచీన గుహల గురించి ఆధునిక కాలంలో బ్రిటిష్ భూతత్వ శాస్త్రజ్ఞుడు రాబర్ట్ బ్రూస్ ఫూట్ 1884 లో మొట్ట మొదట ప్రస్తావించాడు. దాదాపు ఒకశతాబ్దం తరువాత అంటే 1982-83 లో డేనియల్ గెబార్ అనే జర్మన్ భూతత్వశాస్త్రవేత్త నేతృత్వంలో ఒక 'స్పీలియోలజిస్టుల' బృందం బెలుం గుహల గురించి కూలంకషంగా పరిశోధనలు జరిపింది. స్పీలియోలజీ అంటే గుహల భౌతిక, భూతత్వ, జీవఅంశాలను పరిశీలించే విభాగం. వీటిని ప్రత్యేక పర్యాటక ఆకర్షణగా తీర్చిదిద్దడానికి 1999 లో ఆంధ్రప్రదేశ్ పర్యాటకాభివృద్ధి సంస్థ ఈ గుహలను తన యాజమాన్యంలోకి తీసుకున్నది.

బెలుం గుహలను మీరు తప్పక సందర్శించండి. ప్రకృతి సహజ సౌందర్యానికి మరపురాని మచ్చుతునకలు ఈ గుహలు!





ఇక్కడికి ఎలా వెళ్ళాలో తెలుసా? కర్నూలు జిల్లా కొలిమిగుండ్ల మండలం బెలుం గ్రామం సమీపంలో ఉన్నాయి ఈ గుహలు. సమీప పట్టణాల నుంచి బస్సు సౌకర్యం ఉంది. కర్నూలు నుంచి బనగానిపల్లి గుండా 110 కి.మీ. * నంద్యాల నుంచి 60 కి.మీ. * తాడిపత్రి నుంచి 31 కి.మీ* అనంతపురం నుంచి 84 కి.మీ. * బెంగుళూరు నుంచి 270 కి.మీ. పాఠశాల విద్యార్థులు ఇక్కడికి వినోదయాత్రలకు వెళ్ళాలంటే ఆంధ్రప్రదేశ్ పర్యాటకాభివృద్ధి సంస్థ కావలసిన ఏర్పాట్లు చేస్తుంది; తగిన సలహాలు ఇస్తుంది.

ఈ నెల విశేషాలు సంపుటి 106 ఆగస్ట్ 2002 సంచిక 2



పేఁరాజుమహిమ (బే.క) 19



సుకన్య ప్రాయశ్చిత్తం! 25



మాయాసరోవరం 11



నవ్వు-అందం 28



## ఈ సంచికలో





మీరే చేసుకోవచ్చు ఒంటికొమ్ము ఖడ్గమృగం (రేఖాచిత్రం)..36

**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of Chandmama India Ltd.***
**to**
**Subscription Division**
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్‌ద్వారా రూ.**120**లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా
గానీ,మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్
పేరిట పంపండి':

ఈ పత్రికలో ప్రకటనల
కోసం సంప్రదించండి:

చెన్నయ్
ఫోన్: 044-234 7384,
234 7399

ఢిల్లీ
మోనా భాటియా
ఫోన్:011-651 5111/
656 5513/656 5516

ముంబాయి
షకీల్ ముల్లా
మొబైల్ :**98203-02880**
ఫోన్: 022-266 1599/266 1946/
265 3057



వ్యవస్థాపకులు
బి.నాగిరెడ్డి - చక్రపాణి

# ఉజ్వల భవిష్యత్తుకోసం

స్వాతంత్ర్యం పొందిన తరవాత గత యాభై ఐదుసంవత్సరాలలో వివిధరంగాలలో మనదేశం ఎంతో ప్రగతిని సాధించింది. వ్యవసాయరంగంలోనేకాక, పారిశ్రామికరంగంలోనూ సత్వర అభివృద్ధిని సాధించింది. అంతరిక్ష, సమాచార, సాంకేతికరంగాలలో మనం సాధించిన ప్రగతి; అణ్వాయుధాల తయారీలో మనకున్న శక్తిసామర్థ్యాలు–వర్ధమానదేశాలనే కాకుండా అభివృద్ధి చెందినదేశాలను సైతం అబ్బురపడేలా చేశాయి. ఇది మనమందరం గర్వించతగ్గ విశేషం!

అయితే, ఇలా ఒకవైపు సర్వతోముఖాభివృద్ధి స్పష్టంగా కనిపిస్తున్నప్పటికీ, మరోవైపు నిరుద్యోగం, పేదరికం, అధిక ధరలు, అల్లరులు జాతిని జలగల్లా పట్టి పీడిస్తున్నాయి. వీటన్నిటికీ కారణం ఏమిటి? కొందరి విపరీత స్వార్థం; దేశభక్తి లోపించడం; మహోన్నతమైన మన గత వైభవాన్ని మరిచిపోవడం. "నా ఇంటి చుట్టూ గోడలు లేపాలన్నదీ, కిటికీలను మూసుకుని కూర్చోవాలన్నదీ నా అభిమతం కాదు; ప్రపంచదేశాల సంస్కృతీ సుమవాయువులన్నీ నా ఇంట స్వేచ్ఛగా వీచాలి. అయితే, వాటి ఉధృతంలో నా కాళ్ళు నిలబడలేక కొట్టుకుపోవడం మాత్రం నాకిష్టంలేదు!" అన్నాడు మన జాతిపిత గాంధీజీ.

"మన సంస్కృతీ వారసత్వాలను దృఢంగా పరిరక్షించుకుంటూ, అభివృద్ధిచేసుకుంటూ మన ప్రత్యేకతను నిలబెట్టుకోవాలి!" అని పిలుపునిచ్చాడు స్వామి వివేకానంద.

దేశభక్తితో ప్రజలు పాటుపడితే సాధించరానిదంటూ ఏదీ ఉండదు. ఉదాహరణకు జపాన్, జర్మనీ దేశాలనే తీసుకుందాం. రెండవ ప్రపంచయుద్ధం చివర రెండు దేశాలూ చిన్నాభిన్నమైపోయాయి. అయినా, కొద్దికాలంలోనే పూర్వస్థితిని సంతరించుకున్నాయి. కారణం – ఆ దేశ ప్రజల అకుంఠిత దీక్ష, పట్టుదల, దేశాభిమానం!

దేశమంటే మట్టికాదు; మనుషులు. అన్ని శక్తులకన్నా మానవశక్తే మహత్తరమైనది. స్వాతంత్ర్యదినోత్సవసందర్భంగా ఈ సత్యాన్ని మరొక్కసారి స్మరించుకుని, మనదేశాన్ని మరింత పటిష్ఠమైన దేశంగా తీర్చిదిద్దుకుంటూ, ఉజ్వల భవిష్యత్తుకోసం ముందుకు సాగుదాం!

సంపాదకుడు : విశ్వం
Visit us at : http://www.chandamama.org



## హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

# హీరోస్ ఆఫ్ ఇండియా - 11

ఆధునిక భారతదేశంలో పలువురు ప్రముఖులు (హీరోలు) ఉన్నారు. వారిలో కొందరిని గురించి ఇక్కడ ప్రస్తావించడం జరిగింది. మీరు ఎందరిని గుర్తించగలరో ప్రయత్నించి చూడండి.

అన్నీ సరైన సమాధానాలు గల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!



**1** జీవితకాల సాధనకు ఆస్కార్ అవార్డును అందుకున్న ఏకైక భారతీయ సినిమా డైరక్టర్ని నేను. నా పేరేమిటో తెలుసా?

-----------------------------------------

**2** 1987 లో ఫస్ట్ వరల్డ్ ఫుడ్ బహుమతిని అందుకున్నాను. 'హరిత విప్లవ పిత'గా కూడా నన్ను చెబుతారు? నేనెవరు?

-----------------------------------------

**3** నేను సుప్రసిద్ధ మరాఠీ నాటక రచయితను. నా నాటకాలు భావగర్భిత హాస్యానికి పేరుగాంచాయి. మీరు నన్నెరుగుదురా?

-----------------------------------------

**4** నేనే మొట్టమొదటి భారతీయ అంతరిక్షగామిని. నా పేరేమిటో తెలుసు కదా?

-----------------------------------------

**5** ఒడిస్సీ నాట్యానికీ, నా పేరుకూ అవినాభావ సంబంధం ఉంది. నేను పద్మశ్రీ, పద్మభూషణ్ అవార్డుల గ్రహీతను. నా పేరేమిటి?

-----------------------------------------

ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపినచోట మీ సమాధానాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన ఆధునిక హీరో ఎవరు? ఎందుకు? అన్న విషయాలను పది పదాలకు మించకుండా రాయండి.

**నా అభిమాన ఆధునిక హీరో:**

..............................................................

..............................................................

పాల్గొనేవారి పేరు: ..................................................

వయసు:..............తరగతి: ........................................

చిరునామా:..............................................................

..............................................................

పిన్: ........................ ఫోన్: ........................

పాల్గొనేవారి సంతకం: ......................

తల్లి/తండ్రి సంతకం:......................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2002 సెప్టెంబర్ 5వ తేదీలోగా అందేలా ఈ చిరునామాకు పంపండి:

హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్-11
చందమామ ఇండియా లిమిటెడ్
82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ
ఈకాట్టుత్తాంగల్, చెన్నయ్-600 097.

<u>సూచనలు:</u>

1. 8-14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువ వచ్చినట్టయితే, నా అభిమాన హీరో వివరణ ఆధారంగా విజేతలు ఎంపిక చేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

బహుమతులను మీకు అందజేస్తున్నవారు



# శాస్త్రవేత్త-రాష్ట్రపతి

భారతదేశ పదకొండవ రాష్ట్రపతి డా. ఎ.పి. జె. అబ్దుల్ కలాం దేశంలోని ఉన్నత శాస్త్ర వేత్తలలో ఒకరు. జూలై 24 వతేదీ ఆయన రాష్ట్రపతిగా అంటే మన దేశాధ్యక్షుడిగా పదవీ బాధ్యతలు స్వీకరించారు. దేశానికి ఒక శాస్త్ర వేత్త అధ్యక్షుడు కావడం బహుశా ఇదే ప్రథమం.



డా. అవుల్ పకీర్ జైనులబ్దీన్ అబ్దుల్ కలాం ఆయన పూర్తి పేరు. ఆయన 1931 లో రామేశ్వరంలో ఒక సాధారణ కుటుంబంలో జన్మించారు. రామేశ్వరం, ధనుష్కోటి మధ్య నడిచే రెండు పడవలు ఆయనతండ్రికిసొంతంగా ఉండేవి. ఏడుగురు సంతానంలో ఏడవవాడు అబ్దుల్ కలాం. అబ్దుల్ కలాం రామనాధపురంలోని ఒక క్రిస్టియన్ మిషనరీ స్కూలో ఎస్. ఎస్. ఎల్. సి. వరకు చదివారు. తిరుచిరాపల్లి సెయింట్ జోసెఫ్స్ కళాశాలలో బి.ఎస్.సి. (భౌతికశాస్త్రం) చదివారు. ఆ తరవాత మద్రాసు ఇన్స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో 'ఏరోనాటిక్స్' చదివారు.

స్నాతకోత్తరపట్టా పుచ్చుకుని డిఫెన్స్ రీసెర్చ్ ఆర్గనైజేషన్ (రక్షణ పరిశోధన అభివృద్ధి సంస్థ) లో చేరి నలభై సంవత్సరాలు పనిచేశారు. 'అగ్ని' 'పృథ్వి' లాంటి క్షిపణుల తయారీలో ఆయన కీలకపాత్ర వహించారు. అందుకే ఆయన్ను 'క్షిపణి శాస్త్రవేత్త' అని చెబుతారు. 'పోఖ్రాన్' విజయానికి కూడా ఆయన ఎంతగానో కృషి చేశారు. ఆయన భారత ప్రభుత్వానికి విజ్ఞానసలహాదారుగా కూడా పనిచేశారు. కేంద్ర ప్రభుత్వం అత్యున్నతమైన 'భారత రత్న' అవార్డుతో ఆయన్ను సత్కరించి గౌరవించింది.

పదవీ విరమణ తరవాత ఆయన తన సమయాన్ని బాల బాలికల మధ్య, యువతరం మధ్య గడపాలని ఆశించారు. తరచూ ఆయన విద్యాలయాలకు వెళ్ళి మనదేశ భవిష్యత్తు గురించి పిల్లలమధ్య ముచ్చటించేవారు. ఇటీవల గాంధీ జన్మస్థానమైన పోర్బందర్‌కు వెళ్ళినప్పుడు ఒక అమ్మాయి ఆయన పిల్లలకిచ్చే సందేశం ఏమిటని అడిగింది. "వ్యక్తికన్నా దేశం చాలా గొప్పది అన్న ఉదాత్త భావంతో ప్రతి ఒక్కరూ పెరగాలి!" అని ఆయన చెప్పారు. భవిష్యత్తులో మనదేశం ఎలా అభివృద్ధి చెందాలో వివరిస్తూ 'ఇండియా 2020 ఎ విజన్ ఫర్ ది న్యూ మిలీనియం' అనే గ్రంథాన్ని రచించారు.

ఉర్దూలో ఖురాన్‌నూ, సంస్కృతంలో భగవద్గీతనూ ఆయన సమాన ఆసక్తితో పఠిస్తారని చెబుతారు. ఆయనకు వీణ వాయించడం చాలా ఇష్టం.

1947 ఆగస్టు 15వ తేదీ స్థానిక పత్రికలో జవహర్‌లాల్ నెహ్రూ జాతీయ పతాకావిష్కరణ చేస్తున్నట్టూ, కల్లోలపూరితమైన నవకాళీ వీధులలో గాంధీజీ నడుస్తూన్నట్టూ వెలువడిన ఫోటోలను గుర్తుచేసుకుంటూ, "నాయకత్వం అన్నది చాలా విలక్షణమైన గుణం," అన్నారు అబ్దుల్ కలాం. అలాంటి విలక్షణమైన వ్యక్తే ప్రస్తుతం మనదేశ అధ్యక్షులయ్యారు. అశేష పాఠకుల తరఫున చందమామ నూతన రాష్ట్రపతికి తన శుభాకాంక్షలు తెలియజేస్తున్నది.

# పిన్నవయసు!

పూర్వం వింధ్యపర్వత ప్రాంతాలగల విజయపురి రాజ్యం పట్ల, ఇరుగుపొరుగు రాజ్యాలు శత్రుభావంతో మెలుగుతూండేవి. ఆ కారణంగా, రాజ్యం ఎప్పుడూ యుద్ధవాతావరణంతో వుండేది. ఇలాటి పరిస్థితుల్లో ప్రధానమంత్రి మరణించాడు. రాజు, మిగిలిన మంత్రుల్లో రమాకాంతశర్మ అనే అతణ్ణి ప్రధానమంత్రిగా నియమించాడు.

ఈ కొత్త ప్రధాని, రాజుకిచ్చే వివేకవంతమైన సలహాలవల్లా, మంత్రాంగంవల్లా సంవత్సరం గడిచేలోపల విజయపురి రాజ్యానికి, పొరుగురాజ్యాలతో సత్సంబంధాలు ఏర్పడినై. ఇలా ఎంతోకాలం గడిచింది. ఒకనాడు రమాకాంతశర్మ రాజుతో, "మహారాజా నేనిక విశ్రాంతి తీసుకోదలిచాను; అనుమతించండి. రాజ్యానికి నాకంటే పిన్నవయసువాడు ప్రధానమంత్రి కావలసిన అవసరం వున్నది," అన్నాడు.

రాజు,రమాకాంతశర్మను మరికొంతకాలం వుండమని కోరాడు. కాని, అందుకు రమాకాంత శర్మ ఒప్పుకోలేదు. అప్పుడు, రాజు ఆయన్నే కొత్త ప్రధానమంత్రిని ఎంపికచేయమన్నాడు.

రమాకాంతశర్మ, మంత్రులు ముగ్గురిలో ఒకరిని కొత్త ప్రధానిగా ఎంపికచేశాడు. ఇక్కడ వింతగొలిపే విషయమేమంటే – రమాకాంతశర్మ తొంభైయేళ్ళవాడు, ఆయన ఎంపికచేసిన ప్రధాని వయసు ఎనభైయేళ్ళు!





# మాయాసరోవరం

## 7

[ఆశ్విక భటులద్వారా జయశీలుడికి, మంత్రి ధర్మమిత్రుడు కొండచెరువు దగ్గిర విడిదిచేసినట్టు తెలిసింది. మకరకేతును, అతడు అక్కడికి తీసుకుపోవాలని బయల్దేరాడు. తనకు ఎలాగూ చావు తప్పదని భయపడిన మకరకేతు, జలగ్రహానికి నీరుపెట్టే నెపంమీద, దాన్ని కొండచెరువులోకి తీసుకుపోయి, జయశీల సిద్ధసాధకులతోపాటు నీళ్ళలో అమాంతం మునిగాడు. -తరవాత]

జలగ్రహం హఠాత్తుగా నీట మునగడమేగాక, నీటి అడుగున వేగంగా ముందుకు బయలు దేరడంతో, జయశీలుడికీ, సిద్ధసాధకుడికీ, దాని మీదినుంచి పైకితేలే అవకాశం లేకుండా పోయింది. సిద్ధసాధకుడు తనకు చావు సమీ పించిందన్న భయంతో, "జై, మహాకాళా!" అంటూ కేకపెట్టాడు.

ఆ కేక జయశీలుడికి స్పష్టంగా వినిపిం చింది. అంతేకాక, తనకు ముందున్న మకర కేతు కూడా కనిపిస్తున్నాడు. అంటే, నీటి అడుగున తను చూడగలుగుతున్నాడు; ధ్వనులు స్పష్టంగా వినగలుగుతున్నాడు. ఏమిటీ విచిత్రం!

జయశీలుడు, మకరకేతు భుజం పట్టు కుని, "ఒరే, దుర్మార్గుడా! నువ్వు చేసిన పనే మిటి? మమ్మల్ని నీట ముంచి చంపదలి చావా?" అని అడిగాడు.

దానికి మకరకేతు బిగ్గరగా నవ్వి, "జయ శీలా, మనం ఇప్పుడు తాటి ప్రమాణం గల నీటి అడుగున వున్నాం. మనిషి అయినవాడు



ఇంత లోతు నీటి అడుగున గాలి పీల్చ గలడా? మాట్లాడగలడా? చూడగలడా?'' అని ప్రశ్నించాడు.

''అవును, జయశీలా, ఏమిటీ వింత! అంతా, ఆ మహాకాళుడి దయ,'' అంటూ సిద్ధసాధకుడు చుట్టూ ఆశ్చర్యంతో కలయ చూశాడు.

జలగ్రహం తలెత్తి సూటిగా ముందుకు దూసుకుపోతున్నది. ఎదురుగా ఒకచోట నీటి అడుగున వున్న ఒక పెద్ద కొండగుహలోంచి, నీరు మహావేగంగా వచ్చి పడుతున్నది.

మకరకేతు, ''జలగ్రహా!'' అని తన వాహనాన్ని హెచ్చరించి, కొండగుహకేసి నడుపుతూ, ''జయశీలా, సిద్ధసాధకా! మాట్లాడరేం, ఆలోచిస్తున్నారా? నీటి అడుగున వుండీ, మీ ఇద్దరూ ప్రాణాలతో వుండడానికి కారణం అర్థమైందా?'' అన్నాడు.

''ఆ, అర్థమైంది! నిన్నూ, నీ జలగ్రహాన్నీ అంటిపెట్టుకు వున్నంత వరకూ, మా బోటి మనుషులకు్కూడా, నీటి అడుగున గాలి పీల్చుతూ బతగ్గలిగిన శక్తి వుంటున్నదన్న మాట!'' అన్నాడు జయశీలుడు.

''బాగా గ్రహించావు! మరి కత్తిపిడి మీద చేయివేశావెందుకు?'' అన్నాడు మకరకేతు పరిహాసంగా.

''నీ తల నరకడానికి! ముందు జలగ్రహాన్ని నీటిపైకి తీసుకుపోతావా, లేదా?'' అన్నాడు జయశీలుడు కోపంగా.

సిద్ధసాధకుడు శూలాన్ని ఎత్తి, ''జై, మహాకాళా! నీటి అడుగున నీకు ఏ ప్రాణినీ బలి ఇచ్చిన భక్తుడు, ఈనాటి వరకూ భూప్రపంచంలో వుంటాడనుకోను!'' అంటూ శూలాన్ని మకరకేతు మెడకు ఆనించాడు.

మకరకేతు పెద్దగా నవ్వి, ''మీ ఆజ్ఞపాటించనందుకు, మీరు నా తల నరుకుతారా? సరే, అలా జరిగిన మరుక్షణం మీ ఇద్దరికీ నీటి అడుగున బతగ్గలిగిన శక్తి పోతుంది. ఆ తర్వాత, మీ ఇద్దరి శవాలూ నీటిపైన తేలి ఆడగలవు,'' అన్నాడు.

మకరకేతు ఇలా అనేసరికి, జయశీలుడికీ, సిద్ధసాధకుడికీ, ఇప్పుడు తాము మకరకేతుడికి బందీలమన్న వాస్తవం తెలిసి మనసులో భయం కలిగింది.

ఇంతలో ఒక పెద్ద మొసలి, ఒక చేపను తరుముకుంటూ వాళ్ళకేసి వచ్చింది. మకరకేతు మొసలితోకపట్టుకుని దూరంగా విసిరి వేసి, ''జయశీలా, మీరు నాకు బందీలు కారు; నేనూ మీకు బందీని కాను, జలగ్రహం గుహ నీటి నుంచి రెండు కోసుల దూరం

పోయి, అవతలవున్న కొండమీది జలాశయం చేరగానే - అక్కణ్ణించి మీ దారిన మీరు పోవచ్చు,'' అన్నాడు.

ఒక అరగంట కాలం గడిచేసరికి, కొండ మీది జలాశయాన్ని చేరింది జలగ్రహం. మకరకేతు అజ్ఞాపించగానే అది అక్కడ నీటి మీదతేలి, తొండం ఎత్తి పెద్దగా ఘీంకరించింది.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ ఒకసారి గట్టిగా గాలి పీల్చుకుని, ప్రాణాలతో బయట పడినందుకు సంతోషించారు. జయశీలుడు, మకరకేతును, ''ఓయీ కేతూ! మాయాసరో వరం ఇదేనా?'' అని అడిగాడు.

ఆ ప్రశ్నకు మకరకేతు వెంటనే జవాబు చెప్పక, శరీరంలో దిగివున్న కత్తినీ, బాణాన్నీ ఒకసారి చూసుకుని, ''హా, ఇప్పుడు జరిగిన జలచికిత్స, నా శరీర బాధను చాలావరకు ఉపశ మింపచేసింది, అంతా ఆ సరోవరేశ్వరుడి కరుణా కటాక్షం!'' అంటూ ఒక క్షణం ఆగి, ''జయశీలా, మాయాసరోవరం ఇది కాదు, దాన్ని చూసిన మానవమాత్రులెవరూ, ఈనాటి వరకూ, ఆ ప్రాంతాన్ని వదిలి రాలేదు,'' అన్నాడు.

జయశీలుడు మరేదో అడగబోయేంతలో, మకరకేతు, ''జలగ్రహా!'' అంటూ గట్టిగా కేక పెట్టాడు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ రానున్న ప్రమాదాన్ని గుర్తించి, ఏనుగు నీట మునుగు తూండగానే ఇద్దరూ చప్పున ఎగిరి కిందికి దూకి ఈదుకుంటూ పోయి, నీటి వాలున పడి వస్తున్న ఒక చెట్టును పట్టుకున్నారు. వాళ్ళు నీట పడి లేస్తూ, దాని కొమ్మల మీదికి పోయేసరికి, చెట్టు బోదె మీద బోర్లా పడు కుని, ముందు కాళ్ళతో విరిగిన కొమ్మలను



పట్టుకుని వున్న ఒక పెద్దపులి కంట పడింది. చెట్టు నీటిలో మునుగుతూ తేలుతూ, దాపులనున్న జలపాతం చేరి దిగువకు పడు తూండగా, జయశీల సిద్ధసాధకులు ఇవి తమకీలోకంలో ఆఖరిక్షణాలనుకుంటూ గట్టిగా కళ్ళు మూసుకున్నారు.

జలపాతం కొండపైనుంచి కిందికి దుమికే చోట, చిన్నా పెద్ద కొండరాళ్ళు చాలా వున్నవి. చెట్టు మధ్యమభాగం ఒక కొండరాయి మీద పడి, రెండుగా విరిగింది. ఒక భాగం మీద జయశీలుడూ, రెండవ భాగం మీద పులీ, సిద్ధసాధకుడూ వున్నారు.

కొంతసేపటికి జయశీలుడు కళ్ళుతెరిచి చూశాడు. అతడిప్పుడు నీటి అంచునవున్నాడు. నడుము నుంచి దిగువభాగం నీటిలో తడుస్తు న్నది. తల మాత్రం కొంత మిట్టప్రదేశాన వున్నది. దూరంగా జలపాతం హోరు వినిపిస్తున్నది.



"నేను బతికే వున్నానన్నమాట, గొప్ప అదృష్టవంతుణ్ణి!" అనుకుంటూ జయశీలుడు లేచి నిలబడి, హఠాత్తుగా సిద్ధసాధకుడు జ్ఞాపకం రాగా, "సాధకుడెక్కడ?" అనుకుంటూ ప్రవాహంకేసి చూశాడు. అక్కడ అతడి జాడలేదు.

వెంటనే జయశీలుడికి, ఎన్నో రోజులుగా తనకు మిత్రుడై, కష్టాల్లో భాగం పంచుకున్న సాధకుడి మీద ఎంతో జాలి కలిగింది.

జయశీలుడు చప్పున కదిలి నది ఒడ్డున అల్లిబిల్లిగా పెరిగిన చిన్నచిన్న పొదలమధ్యగా కొంతదూరం పోయేసరికి, హఠాత్తుగా పెద్దపులి అరుపు వినిపించింది. వెంటనే అతడికి జలపాతంలో చిక్కుకున్న పులి గుర్తుకు వచ్చింది.

"సాధకుడు, పులికి ఆహారం కాలేదుకదా!" అనుకుంటూ జయశీలుడు చప్పున కత్తి దూసి, ఆ ధ్వని వచ్చిన వైపుకు నడిచాడు.

ఒకచోట సిద్ధసాధకుడు కదలా మెదలక నీటి ఒడ్డున పడివున్నాడు. వెనక కాళ్ళు రెండూ రాళ్ళ దెబ్బలకు విరిగిపోయిన పులి చిన్నగా గాండ్రిస్తూ, ముందుకాళ్ళ మీద పాకుతూ, సాధకుణ్ణి సమీపిస్తున్నది.

పులినుంచి సిద్ధసాధకుడికి రానున్న ప్రమాదాన్ని గుర్తించిన జయశీలుడు, వేగంగా పరిగెత్తుతూ, సమయానికి చేతికందిన ఒక చిన్న రాయిని గురిగా దానిమీదికి విసిరాడు. రాయి తగలగానే తల తిప్పి పులి కోపంతో భీకరంగా గాండ్రించింది.

ఆ గాండ్రింపుతో స్పృహ వచ్చిన సిద్ధసాధకుడు తృళ్ళిపడి తలుఎత్తి, పులి కంటబడగానే, "రక్షించు, మహాకాళా!" అంటూ కేకపెట్టాడు.

ఈ లోపల జయశీలుడు, పులికి వెనక రెండు కాళ్ళూ విరిగినవని గ్రహించి, వాటిని బలంగా పట్టుకుని దూరంగా లాగాడు. సిద్ధసాధకుడు నీళ్ళలో లేచి నిలబడి, "జయశీలా, నువ్వు ఇక్కడే వున్నావా? పులి గాండ్రింపుతో నాకు ప్రాణం తిరిగి వచ్చింది," అన్నాడు.

జయశీలుడు, బాధతో నేలమీద పొర్లాడుతున్న పులికేసి చూసి, "జలపాతం నుంచి కింద రాళ్ళ మీద పడి పులి రెండు కాళ్ళూ విరగ్గొట్టుకున్నది. ఇక దీనికి ఆహారం సంపాదించే శక్తిలేదు. ఏమైనా దీన్ని చంపడానికి నాకు చేతులాడడం లేదు," అన్నాడు.

సిద్ధసాధకుడికి నీటి ఒడ్డున కొద్ది దూరంలో శూలం దొరికింది. అతడు జయశీలుడి నుంచి కత్తి తీసుకుని, "ప్రాణాలతో నరకబాధపడే ఈ పులికి, బాధా నివృత్తి చేస్తున్నాను, అలా చేయడం పుణ్యం!" అంటూ కత్తితో ఒక్క వేటుకు పులి తలను మొండెం నుంచి వేరు చేశాడు.



జయశీలుడు కొద్ది క్షణాలు ఆలోచిస్తూ మౌనంగా వూరుకుని, "మకరకేతును మనం వదలవలసిందికాదు!" అన్నాడు.

"జయశీలా! ఇప్పుడు ఆలోచించవలసింది, గతాన్ని గురించి కాదు. మనం ఎలాంటి ప్రాంతానికి చేరాం అన్నది ప్రశ్న!" అన్నాడు సిద్ధసాధకుడు.

ఆ ప్రశ్నకు జవాబా అన్నట్టు, సాధకుడు మాట ముగించేలోపలే, నదికి దిగువనున్న గుబురుచెట్లప్రాంతాన్నుంచి, ఒకమనిషి పెట్టిన చావుకేకా, కొండగొర్రె అరుపూ వినిపించినై.

"కొండగొర్రె మనిషిని పట్టిందా? లేకమనిషి కొండగొర్రెను పట్టాడా–ఇద్దరూ ప్రాణభయంతో అరిచినట్టుందే!" అన్నాడు సిద్ధసాధకుడు, ఆ ధ్వని వచ్చినవైపు తలతిప్పి చూస్తూ.

ఇద్దరూ ఆ ధ్వని వచ్చినవైపుకు నడిచారు. కొంతదూరం వెళ్ళేసరికి, వాళ్ళకు భయాశ్చర్యాలు కలిగించే దృశ్యం ఒకటి కంటబడింది. నీటి ఒడ్డున వున్న ఒక మహావృక్షం కొమ్మ నుంచి ఒక గొర్రెపొటేలూ, ఒక మరుగుజ్జు మనిషీ వేళ్ళాడుతున్నారు.

ఇది చూస్తూనే సిద్ధసాధకుడు శూలం ఎత్తి, "వీళ్ళను పట్టినదేదో అదృశ్యంగా వున్న భూతం! ఈ క్షణమే నా శూలంతో దాని గుండెల్ని చీల్చబోతున్నాను," అంటూ కొమ్మ కిందికి పోయి, శూలం ఎత్తబోయేంతలో, మరొక చెట్టుకొమ్మ చప్పున అతడికేసి వంగి భుజం పట్టుకున్నది.

సిద్ధసాధకుడు ఎగిరి పక్కకు గంతువేసి, "జయశీలా, జాగ్రత్తసుమా! వీళ్ళను పట్టింది ఆయీ భూతం కాదు, అదృశ్యంగా చెట్టులో వున్న ఎవడో రాక్షసుడు," అన్నాడు.

జయశీలుడు మారు మాట్లాడకుండా ముందుకుపోయి, చెట్టు కొమ్మను కత్తివేటుతో నరికాడు. మరుగుజ్జువాడూ, గొర్రెపొటేలూ దిగువనున్న నది నీటిలో దభీమంటూ పడ్డారు.

నీళ్ళలో నుంచి వడవడ వణికిపోతూ బయటికి వచ్చిన మరుగుజ్జువాడు, జయశీలుడూ, సిద్ధసాధకులకేసి కళ్ళు చికిలించి చూస్తూ, "అయ్యాలారా! తన సేనానాయకుణ్ణి మనుషులను తినే రాక్షసిచెట్టు నుంచి కాపాడినందుకు, మాగడేకారిరాణి తమకు తప్పక మంచి బహుమానం ఇస్తుంది," అన్నాడు.

వాడు మాట ముగించే లోపలే, చెట్ల చాటున పెద్ద కలకలం బయలుదేరింది. ఆ మరుక్షణం, రెండు కొండపొటేళ్ళను పూన్చిన రథం మీద, జింక చర్మాలు ధరించి, కొంగా, నెమలి ఈకలూ కలిపి కుట్టిన కిరీటం పెట్టుకున్న, ఒక స్త్రీ వాళ్ళకేసి వచ్చింది. ఆ రథం



వెనకా, పక్కలా పొటేళ్ళను ఎక్కి, చేత బల్లా లను పట్టుకున్న చాలామంది మరుగుజ్జు వాళ్ళు వున్నారు.

వాళ్ళను చూస్తూనే మరుగుజ్జు సేనా నాయకుడు ముందుకు పోయి, "మహా రాణీ!" అంటూ రథంలో వున్న మరుగుజ్జు స్త్రీకి వంగి నమస్కారం చేసి, ఆమెకు జయ శీలుణ్ణీ, సిద్ధసాధకుణ్ణీ చూపుతూ, "ఈ ఇద్దరూ నన్ను జీవభక్షకవృక్షం నుంచి కాపాడారు," అని చెప్పాడు.

మరుగుజ్జు రాణి, "ఓహో, అలాగా!" అంటూ తల వూపి, "ఓ, మహాకాయుల్లారా! రాత్రి నా కలలో కనిపించి, మాగడేకారి శత్రు వులనందరినీ హతమార్చి, మాకు శాశ్వత రక్షణ కల్పిస్తామని మాట ఇచ్చినవారు మీరే కదా?" అని అడిగింది.

"ఈ రాణి ఏదో పెద్ద గడుసుపిండంలా గుందే! జయశీలా, మనం తగు జాగ్రత్తలో వుండాలి సుమా," అన్నాడు సాధకుడు మెల్లిగా జయశీలుడితో.

"మంచి మాట సేర్చరి! పాపం, ఈ పొట్టి మనుషులకు ఎవరి నుంచి ప్రమాదం రాను న్నదో! వీలైనంత సాయం చేద్దాం," అన్నాడు జయశీలుడు.

ఆ మాటలకు సాధకుడు అయిష్టంగా ముఖంపెట్టి, "జయశీలా, మనం ఒకానొక మహోన్నత కార్యం సాధించేందుకు బయ ల్దేరాం. ఆ సంగతి మరిచి, ఈ పిల్లిపెసర గింజలు ఏరే పనుల్లో పడ్డామంటే, ఎందుకూ కొరగాకుండా పోగలం," అన్నాడు.

"సాధకా, కనకాక్షరాజుగారి పిల్లల ప్రాణా ల్లాంటివే, ఈ మరుగుజ్జు మనుషుల ప్రాణా లుకూడా. వీళ్ళకు ఎవరినుంచి ప్రమాదం రానున్నదో విని, చేతనైన సాయం చేయటం ధర్మం అనిపించుకుంటుంది," అన్నాడు జయశీలుడు.

అంతలో దాపులనున్న కొండగుట్ట మీది నుంచి భయంగొల్పే అరుపు వినిపించింది. అందరూ అటుకేసి తలలు తిప్పి చూశారు. పదీ పన్నెండడుగుల ఎత్తున్న వికృతాకారం ఒకటి గుట్టమీద నిలబడి వున్నది. దాని చేతులలో ఒక పెద్ద బండరాయి! దాని నడుముకు కట్టిన ఇనప గొలుసును ఒక చేత్తో పట్టుకుని,రెండవ చేతిలో కత్తి పట్టుకుని, ఒక మనిషి నిలబడి వున్నాడు.

ఆ వికృతాకారాన్ని చూస్తూనే, మరుగుజ్జు రాణితోపాటు, ఆమె అనుచరులందరూ గడగడ వణికిపోసాగారు. వికృతాకారం పక్కన నిలబడినవాడు, కత్తితో దాని వెన్నుమీద గీరాడు. వికృతాకారం రాయిని అలాగే పట్టుకుని అటూ ఇటూ గెంతసాగింది.

జయశీలుడు, సిద్ధసాధకుడితో, "సాధకా, ఆ భయంకర జంతువును మచ్చికచేసి ఆడిస్తున్నవాడు మరుగుజ్జు కాదు; మనలాంటి వాడే! అది ఏ జాతి జంతువైవుంటుంది?" అని, మరుగుజ్జురాణితో, "మహారాణీ! మీకు శత్రువులన్నావే, వాళ్ళు ఆ కనబడే భయంకర జంతువూ, దాని వెంటవున్న మనిషేనా?" అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నతో రాణి కాస్త స్థిమితపడి, రథం దిగి జయశీల, సిద్ధసాధకుల ముందుకు వచ్చి, "మహాకాయుల్లారా! మా శత్రువులు, కొండ అవతలవున్న మా జాతివాళ్ళే! కాని, వాళ్ళు తాము యక్షజాతి నుంచి ఉద్భవించామనీ, మాకన్న ఉన్నతులమనీ అహంకరించి,మమ్మల్ని నాశనం చేయాలని చూస్తున్నారు," అన్నది.

"అంత భయంకర ప్రాణిని మచ్చిక చేసిన వాళ్ళు, మిమ్మల్ని ఏనాడో లొంగదీసుకుని వుండవలసిందే!" అన్నాడు సిద్ధసాధకుడు.

"మహాకాయుల్లారా! ఆ భయంకర జంతువు, నరవానరం. దానిచేత మా మీదికి రాళ్ళు విసిరిస్తున్నవాడు, మీలాంటి మనిషి. ఆ ఇద్దరూ పదీ పన్నెండు రోజుల క్రితమే, మా శత్రువులతో వచ్చి చేరారు," అన్నది మరుగుజ్జురాణి.

రాణి మాట ముగించే లోపలే, నరవానరం ప్రళయభయంకరంగా అరిచి, రెండడుగులు ముందుకు వేసి ఎత్తి పట్టుకుని వున్న బండరాయిని, కొండమీది నుంచి మరుగుజ్జుజాతి వాళ్ళకేసి బలంగా విసిరింది. – (ఇంకావుంది)



# తగిన భార్య!

హోడ్జా నజీరుద్దీన్ ఒకనాడు తన స్నేహితుడితో కూర్చుని ద్రాక్షరసం తాగుతూండగా, మరొక మిత్రుడు సంతోషంగా అక్కడికి వచ్చి, "వచ్చే వారం నాకు పెళ్ళి. నువ్వు రావాలి," అన్నాడు.

"తప్పకుండా వస్తాను. కూర్చో," అంటూ ద్రాక్షరసం అందించాడు హోడ్జా.

వచ్చిన మిత్రుడు లోటాను అందుకుంటూ, "అవునూ, చాలాకాలంగా నాకు ఒక అనుమానం," అన్నాడు.

"ఏమిటి?" అన్నాడు హోడ్జా.

"ఇంతకాలంగా నువ్వు ఎందుకు పెళ్ళి చేసుకోలేదు? అసలు పెళ్ళి ప్రయత్నం చేశావా, లేదా?" అని అడిగాడు మిత్రుడు.

"చేశాను, చేశాను. ఇప్పుడు కాదు. చాలా యేళ్ళక్రితం," అన్నాడు హోడ్జా.

"అలాగా! తగిన వధువు దొరకలేదా ఏం?" అన్నాడు మిత్రుడు.

"దొరక్క కాదు; అది చాలా పెద్ద కథ. నేను యువకుడిగా ఉన్నప్పుడు తగిన భార్యను వెతుక్కుంటూ బయలుదేరాను. ఎంతోదూరం ప్రయాణం చేశాను. కొండలూ, కోనలూ తిరిగాను. చివరికి ఒక చిన్న గ్రామంలో ఒక అందమైన యువతిని చూశాను. ఆమె చాలా తెలివైనదీ, గుణవతీ కూడాను. కాని లోకజ్ఞానం శూన్యం. అలాంటి యువతి నాకు పెద్ద సాయంగా ఉండదు కదా. అందుకని తగిన భార్య కాదనుకున్నాను. అక్కడి నుంచి బయలుదేరి ఒక పట్టణం చేరు కున్నాను. అక్కడొక యువతిని చూశాను. ఆమెకు అందచందాలూ, దయాగుణంతో పాటు లోకజ్ఞానం కూడా ఉంది. ఆవేం నాకు ఇంచుమించు తగిన భార్య అనుకున్నాను," అని ఆగాడు హోడ్జా.

"మరి ఆమెనెందుకు చేసుకోలేదు?" అని అడిగారు అతడి మాటలను ఆసక్తిగా వింటూన్న మిత్రులిద్దరూ ఏక కంఠంతో.

"ఆమెకు మన భాష రాదు. భాష రానిదాన్ని చేసుకుని ఎలా కాపురం చేసేదని ఆలోచించి ఆమె తగిన భార్య కాదనుకున్నాను. ఆ తరవాత అక్కణ్ణించి ఈజిప్టుదాకా వెళ్ళాను. అక్కడ ఒక చక్కని యువతిని చూశాను. ఆమెకు అందం, గుణం, లోకజ్ఞానం, దైవభక్తి అన్నీ ఉన్నాయి. మన భాష కూడా తెలుసు. ఆమెతో మాట్లాడి నంతసేపు ఎంతో ఆనందించాను. ఆమె నాకు అన్నివిధాలా తగిన భార్య అని నిర్ణయించాను," అన్నాడు హోడ్జా.

"అంతటి గొప్ప సౌందర్యరాశినీ, సుగుణవతినీ ఎందుకు పెళ్ళిచేసుకోలేదు మరి?" అని అడిగారు మిత్రులు.

"ఏం చేయను! నేను ఆమెను తగిన భార్య అనుకున్నానే తప్ప, ఆమె నన్ను తగిన భర్త అనుకోలేదే!" అంటూ గాఢంగా నిట్టూర్చాడు హోడ్జా.



బేతాళ కథలు

# పేరాజు మహిమ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, కన్ను పొడుచుకున్నా కానరాని గాఢాంధకారంలో, నువ్వు శ్మశానమంతా కలయతిరుగుతూ పడుతున్న శ్రమ చూస్తూంటే జాలి కలుగుతున్నది. నీలాగా ఎలాంటి కఠోర శ్రమలూ పడకుండా, పేరాజు అనే సామాన్య గృహస్థు వాక్శుద్ధీ, మహిమలూ ప్రదర్శించాడు. అయితే, అంత శక్తిమంతుణ్ణీ ఆ దేశపుమంత్రి అజ్ఞాని అన్నాడు. వారిద్దరి కథా చెబుతాను, శ్రమతెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:



పేర్రాజుకు గ్రామంలో చాలా మంచివాడని పేరు. అతడి భార్య ఎంతో అనుకూలవతి. ఆ దంపతులకు ఒక కొడుకూ, ఒక కూతురూ. ఇద్దరికిద్దరూ ముత్యాలే.

ఒక రోజు పేర్రాజు సకుటుంబంగా పట్నం బయల్దేరాడు; అక్కడి వింతలు చూడాలని. దారిలో చిన్న అడవి దాటాలి. అది దాటుతూండగా రెండు చిరుతపులులు అతడి కుటుంబం మీద దాడిచేశాయి. పేర్రాజెలాగో తప్పించుకున్నాడు కానీ అతడి భార్యాబిడ్డలు పులులవాత పడ్డారు.

కాసేపు పేర్రాజు భోరుమంటూ దుఃఖించాడు. తర్వాత గ్రామం దారిపట్టాడు. అక్కడి ఆస్తిపాస్తులన్నీ అమ్ముకుని ఇంకో గ్రామానికి వెళ్ళిపోయాడు. ఆ గ్రామంలో పేర్రాజుకు దూరపుచుట్టం గవర్రాజు వుంటున్నాడు. ఆయన పేర్రాజుకు తన ఇంట ఆశ్రయం ఇచ్చాడు. అందుక్కారణముంది. గవర్రాజు బ్రతక నేర్చినవాడు. నాలుగు రూకల కోసం నలభై అబద్ధాలు చెప్పడానిక్కూడా వెనుకాడడు. పేర్రాజు దగ్గర చాలా డబ్బుందనీ, దాన్నెలాగైనా కాజేసి అతణ్ణి ఇంట్లోంచి ఏదో వంకన వెళ్ళగొట్టాలనీ గవర్రాజు ఆలోచన.

అయితే, చాలా తొందరగా పేర్రాజు తన మంచితనంతో గ్రామస్థులను ఆకట్టుకున్నాడు. అవసరంలో వున్నవారికి అడక్కుండా సాయపడుతూ ఎంతో మంచివాడనిపించుకున్నాడు.

ఇలా వుండగా ఒక రోజున భీముడనే వాడింటిలో దొంగతనం జరిగింది. ఏడాది పాటుపడ్డ కష్టాన్ని రూపాయలుగా మార్చుకుని దాచుకుంటే, దొంగ అదంతా ఎత్తుకుపోయాడు. భీముడు పొరుగూరి వడ్డీ వ్యాపారికి కొంత బాకీ వున్నాడు. అది వెంటనే తీర్చకపోతే, ఆ వ్యాపారి ఇల్లు వేలం వేస్తానన్నాడు. భీముడు లబోదిబోమంటూ పేర్రాజు వద్దకు వచ్చి జరిగింది చెప్పుకున్నాడు.

"ఈ వడ్డీవ్యాపారి విషయంలో నేను నీకు సాయపడతాను. కానీ నిన్నిలా ఉసురుపెట్టినవాడు బాగుపడడు. ఏ చేతులతో దొంగతనం చేశాడో, ఆ చేతులు విరిగిపోతాయి. వాడు దొంగిలించిన డబ్బు వాడి అంత్యక్రియలకే ఉపయోగపడుతుంది!" అంటూ పేర్రాజు, భీముడికి డబ్బిచ్చి పంపాడు.

ఆ తర్వాత ఒక చిత్రం జరిగింది. భీముడింట్లో దొంగతనం చేసింది పొరుగింటివాడైన నారాయణ. అతడారాత్రి పెరట్లో పశువులను అదిలిస్తూండగా ఒకఎద్దు తిరగబడి కుమ్మింది. అప్పుడతడి చేతులు విరిగాయి. వైద్యుడి వద్దకు వెళ్ళి కట్టుకట్టించుకుంటూండగా,

వేరేపనిమీద అక్కడికొచ్చిన గవరాజు అది చూసి, ''నారాయణా! భీముడింట్లో దొంగ తనంచేసినవాడి చేతులు విరిగిపోతాయని మా పేరాజు శాపం పెట్టాడు. వాడికి బాగా వాక్శుద్ధి వుంది. నీ చేతులు విరగడం చూస్తే నువ్వేదురాశకుపోయి, ఆ డబ్బుదొంగిలించా వనిపిస్తోంది. అదే నిజమయితే, వెంటనే భీముడి డబ్బు భీముడికిచ్చెయ్యి. లేకుంటే మా పేరాజు రెండో శాపం ప్రకారం, ఆ డబ్బు నీ అంత్యక్రియలకే ఉపయోగపడుతుంది!'' అన్నాడు.

ఆ మాటలకు నారాయణ హడలి పోయాడు. వెంటనే తన నేరం ఒప్పుకుని, భీముడి డబ్బు భీముడికిచ్చి, శాపం వెనక్కు తీసుకోమని పేరాజువద్దకు వెళ్ళి అడిగాడు.

''నేను శాపమివ్వడమేమిటి? భీముడి దుస్థితి చూసి కోపం కొద్దీ ఒకమాట అన్నాను, అంతే! నువ్వు ఏకంగా నీ తప్పునే సవరించు కున్నావు. నీ చేతికి ఏ ఎముకా విరక్కుండా రెండు రోజుల్లో నీ గాయాలు మటుమాయ మవుతాయిలే,'' అని పేరాజు నవ్వేసి నారా యణకు ధైర్యం చెప్పి పంపేశాడు.

చిత్రంగా రెండు రోజుల్లో నారాయణ చేతి గాయాలు మానిపోయాయి.

గవరాజు ఇది అవకాశంగా తీసుకుని పేరాజుకు గొప్ప వాక్శుద్ధి వుందనీ, అది పేరాజుకే తెలియదనీ గ్రామంలో ప్రచారం ప్రారంభించాడు. గవరాజు ఈ విషయం పేరాజుకు తెలియనివ్వలేదు. పేరాజు చేత మంచిమాట అనిపించడానికీ, చెడ్డమాట అనిపించకుండా వుండడానికీ ధరపెట్టి గ్రామ స్థుల దగ్గర బాగా డబ్బు గుంజసాగాడు.



గ్రామం గ్రామమంతా పేరాజు మాట కోసం ఎగబడుతూంటే, కొన్నాళ్ళకు అసలు విషయం అతడికీ తెలిసిపోయింది. తన పేరు మీదుగా గవరాజు చేస్తున్న మోసానికి తీవ్ర మైన అసంతృప్తి పుట్టగా, ఒకనాటి రాత్రి ఎవరికీ తెలియకుండా ఇల్లు విడిచిపెట్టాడు.

గమ్యం తెలియని ప్రయాణం చేస్తున్న పేరాజుకు ఆకలిదప్పులుతెలిసేసరికిఎక్కడా చెట్టూ, పుట్టా, మనిషీ కనబడలేదు. ''ఇప్పు డెవరైనా కనిపించి, నన్ను తన ఇంటికి చేర్చి విందుభోజనం పెడితే బాగుండును కదా!'' అనుకున్నాడతడు.

ఆ సమయంలో అటుకేసి ఒక గుర్ర బ్బండి వచ్చింది. ఆ బండిలో వున్న ధనవం తుడు, పేరాజును తన బండిలో ఎక్కించు కుని ఇంటికి తీసుకువెళ్ళి చక్కని విందు భోజనం పెట్టాడు.

అప్పుడు పేర్రాజు, ''ఇది కలో నిజమో తెలియడం లేదు!'' అంటూ ధనవంతుడికి తన కథ చెప్పాడు.

ధనవంతుడు కూడా ఆశ్చర్యపడి, ''మీకు నిజంగా మహిమలున్నట్టే తోస్తున్నది. నాకు దైవమే మిమ్మల్ని చూపించాడేమో. పదేళ్ళ నా కుమారుడు నాలుగేళ్ళ వయసు నుంచీ ఏదో తెలియని జబ్బుతో బాధపడుతున్నాడు. మాటకూడా పడిపోయింది. మీ మనోసంకల్పంతో వాడి జబ్బు నయం చేయండి,'' అని కోరాడు.

అప్పటికి పేర్రాజుకూ తన శక్తులపై నమ్మకంకుదురుతున్నది. అతడా ధనవంతుడి కొడుకును చేతులతో నిమిరి, ''పక్షం తిరక్కుండా నువ్వు అందరి పిల్లల్లాగా మామూలుగా లేచి తిరగాలి!'' అన్నాడు.

ఇది జరిగిన నాలుగు రోజులకు పట్నం నుంచి వైద్యుడొకడు వచ్చి, ధనికుడితో, ''మీ అబ్బాయి జబ్బు గురించి విని వచ్చాను. దీన్ని కుదిర్చే మందు నాకు తెలుసు. పది రోజుల్లో మీ వాణ్ణి మామూలు మనిషిని చేస్తాను,'' అన్నాడు.

ఆ వైద్యుడు అన్నట్లే, ఆ మందు పని చేసింది. దాంతో చుట్టుపక్కల పేర్రాజు పేరు మ్రోగిపోయింది. అతడికి వాక్శుద్ధి వున్నదనే అంతా నమ్మసాగారు.పేర్రాజుకూ తనమాటపై విశ్వాసం పెరిగింది.

ఇలా వుండగా - ఒక రోజు సాయంత్రం పేర్రాజు నదీతీరానికి చల్లగాలి కోసం వెళ్ళాడు. అక్కడ ఒకపేదరాలు బట్టలు ఉతుక్కుంటున్నది. ఆమె కొడుకు పదేళ్ళవాడు అటూ ఇటూ రాళ్ళు విసురుతూ ఆడుకుంటున్నాడు. వాటిలో ఒకటి పేర్రాజుకు తగిలింది. బాధతో పేర్రాజు కేకవేయగానే, కుర్రవాడు భయంకొద్దీ నదిలోకి దూకేశాడు. వాడికి ఈత రాదని ఎరిగిన వాడి తల్లి వణికిపోతూ, ''ఓ, పేర్రాజు



బాబూ! నీ శాపం ఏదో తగిలి నా కొడుకు నీటిలో పడిపోయాడు. వాడికి ఈత రాదు. వాడు నీటి నుంచి బయటపడేలా చెయ్యి!'' అని వేడుకున్నది.

పేర్రాజు, ఆమె మాటలకు నొచ్చుకుని, ''భయపడకు! నీ కొడుకిప్పుడు ఈదుకుంటూ ఒడ్డుకు చేరుకోగలడు,'' అన్నాడు.

పేర్రాజు మాట పూర్తిచేసేలోగా పేదరాలి కొడుకు ఈదుకుంటూ ఒడ్డుకు వచ్చాడు. పేదరాలు, పేర్రాజు కాళ్ళమీద పడిపోయి, ''బాబూ, నువ్వు మామూలు మనిషివి కాదు. నువ్వు నా ఇంట్లో కనకవర్షం కురిసేలాగా, నా కొడుక్కు సకల విద్యలూ అబ్బేలాగా వరమివ్వు,'' అని కోరింది.

''చూడమ్మా! మనం మన చేతిలో లేని వాటినే వరంగా కోరుకోవాలి. డబ్బు, చదువు కృషితో సాధించాలి,'' అని హితవు చెప్పి అక్కడి నుంచి బయలుదేరాడు పేర్రాజు.

ఆ సమయంలో, ఆ దేశపు మహారాజు మారువేషంలో దేశసంచారం చేస్తూ అలా వచ్చాడు. ఆయన జరిగిందంతా చూసి అబ్బుర పడుతూ పేర్రాజు గురించీ, అతడి కుటుంబం గురించీ గ్రామంలో మరిన్ని వివరాలు తెలుసుకుని, రాజధానికి చేరగానే అతడికి కబురు చేసి కొలువుకు రప్పించి, మంత్రికి పరిచయం చేశాడు.

తర్వాత రాజు, మంత్రికి పేర్రాజు శక్తి మహిమలను గురించి చెప్పి, ''ఇతడి మాట సాయంతో నేను మన కొలువులోని వారందర్నీ సమర్థులుగా మార్చాలనుకుంటున్నాను. శత్రురాజులను జయించాలనుకుంటున్నాను. నీ సలహా ఏమిటి?'' అని అడిగాడు.



''మహాప్రభూ! పేర్రాజు మాటకున్న శక్తి ప్రచారంవల్ల వచ్చిందనీ, అతడి మహిమలు కాకతాళీయాలనీ మహామేధావులైన తమకు, ఈపాటికి స్ఫురించి వుండాలి,'' అన్నాడు మంత్రి.

ఇది విని రాజాశ్చర్యపడి, మంత్రిని వివరంగా చెప్పమన్నాడు.

అందుకు మంత్రి, ''తన మహిమలతో పేర్రాజు కొత్త విశేషాలు సృష్టించలేదు. మాటవరసకు దొంగచేతులు పడిపోవాలన్నాడు; ప్రమాదవశాత్తు దొంగకు దెబ్బ తగిలింది. తనకు ఎవరైనా విందుభోజనం పెడితే బావుండుననుకుంటే, ధనికుడు బండిలో అటుకేసి వచ్చాడు. కుర్రవాడి జబ్బు నయం కావాలన్న సమయానికే ఒకవైద్యుడు మంచి మందు తెచ్చాడు. ఇలాగే మరికొన్ని!'' అన్నాడు.

రాజు కొద్దిసేపు ఆలోచిస్తూ వూరుకుని, "పేర్రాజును రాచకార్యాలకు ఉపయోగించు కోవడంవల్ల ప్రయోజనముంటే మనకు లాభం. ప్రయోజనం లేకుంటే మనకు జరిగే నష్టం ఏమీ వుండదు గదా!" అన్నాడు.

దానికి మంత్రి, "మహాప్రభూ!పేర్రాజు మాటవల్ల ప్రయోజనం లేకుంటే, మనం నలుగురిలో నవ్వులపాలవుతాం. ఎందు కంటే, మూఢనమ్మకం అవివేకుల లక్షణం. తమరు గ్రామంలో అతణ్ణి గురించిన పూర్వా పరాలన్నీ సేకరించారు గదా. ఒకవేళ పేర్రాజు తన మాటకు గొప్ప మహిమ వున్నదనుకుంటే, అతణ్ణి మించిన అజ్ఞాని మరొకడుండడు. అతడి కుటుంబానికి జరిగిన విపత్తు తమకు తెలుసుగదా?" అన్నాడు.

మంత్రి జవాబు వింటూనే రాజు చాలా ఆశ్చర్యం చెంది, "అవును, సరైన సమయానే జ్ఞాపకం చేశావు!" అంటూ మంత్రిని మెచ్చు కుని, రాజోద్యోగులను పిలిపించి అప్పటి కప్పుడు పేర్రాజును ఘనంగా సన్మానించి, అతడి గ్రామానికి సాగనంపాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, పేర్రా జుకు మహిమలున్నాయో లేవోకానీ, అతడన్న మాటలు నిజమయ్యాయనడానికి చాలా నిదర్శనాలున్నాయి. అవన్నీ కేవలం కాకతా ళీయమనగలమా? మంచితనానికి మారు పేరుగా వుంటున్న పేర్రాజును, మంత్రి అజ్ఞాని అని ఎలా అనగలిగాడు? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఎంత మంచి వాడికైనా తననుమాలిన ధర్మముండదు. పేర్రాజుకు భార్యాబిడ్డలంటే ప్రాణం. అలాంటి వారు చిరుతపులుల వాతబడి ప్రాణాలు కోల్పోతూంటే అతడేమీ చేయలేకపోయాడు. అంటే - అతడిలో ఎలాంటి మహిమలూ లేవనేకదా అర్థం. ఈ వాస్తవాన్ని మంత్రి తార్కికంగా, హేతుబద్ధంగా సరైన సమ యంలో ఎత్తి చూపగానే రాజు తన పొరబాటు గ్రహించి, పేర్రాజుకు తన ఆస్థానంలో పదవి ఇవ్వకుండా, ఘనంగా సన్మానించి పంపే శాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. - (కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]



మన పూర్వగాథలు: 4

# సుకన్య ప్రాయశ్చిత్తం!



శర్యాతి మహారాజు ఒకనాడు తన రాణి, కుమార్తె సుకన్యతో కలిసి వనవిహారానికి వెళ్ళాడు. వసంతశోభతో కళకళలాడుతూన్న అడవి అందాలను తిలకిస్తూ సాయంకాలం వరకు గడిపి ఒక తటాకం సమీపానికి చేరారు. యువ రాణి సుకన్య మనసు ఆనందతరంగాలపై ఓలలాడింది. సీతాకోకచిలుకలా ఆమె అటూ ఇటూ తిరిగి, పురివిప్పి నాట్యం చేస్తూన్న నెమళ్ళు, ఎదురుపడ్డ అందమైన జింకల వెంటబడి, తల్లిదండ్రులనూ చెలికత్తెలనూ వదిలి చాలాదూరం వెళ్ళిపోయింది.

మరికొంతసేపటికి ఆమె అలాగే అరణ్యం లోపలికి వెళ్ళింది. ఎత్తయిన చెట్లనూ, చిన్న చిన్న జలపాతాలనూ చూస్తూ వెళ్ళిన ఆమె సూర్యాస్తమయమై చీకటి కమ్ముకోవడం గమనించి తల్లిదండ్రులున్న తటాకంకేసి వెనుదిరిగింది.

ఉన్నట్టుండి ఒక విచిత్ర దృశ్యం ఆమె దృష్టిని ఆకర్షించింది. దూరంగా ఉన్న పుట్ట నుంచి వింతకాంతి మెరుపులా మెరిసింది. ఆ తరవాత పుట్ట కన్నం నుంచి రెండు ఆభరణాలు మిలమిలా మెరుస్తున్నట్టు కనిపించింది. ఆ పుట్టలో ఏమున్నదో తెలుసుకోవాలన్న ఉత్సాహంకొద్దీ, సుకన్య పక్కనున్న చెట్టునుంచి ముల్లు తుంచి పుట్టలోకి పొడిచింది.

మరుక్షణమే బాధతో ఒక మూలుగు వినిపించింది. ఆ మూలుగు ఎక్కడినుంచి వచ్చిందో ఆమె గ్రహించలేకపోయింది. ఒక్క క్షణం భయపడిపోయి తల్లిదండ్రులున్న తటాకం కేసి పరుగుతీసింది. అక్కడ రాజు వెంట వచ్చిన సైనికులు అంతుబట్టని రుగ్మతతో బాధపడుతూ తటాకం అవలిగట్టు నుంచి కదలలేకపోయారు. దీర్ఘదర్శి అయిన రాజు అదేదో శాపప్రభావమై ఉంటుందని అనుమానించాడు. అయినా తమ సైనికులను ఎవరు శపించి ఉంటారు? కారణం ఏమై ఉంటుంది? అని ఆలోచించసాగాడు.

రాజు కుమార్తెతో కలిసి పుట్ట దగ్గరికి వెళ్ళాడు. పుట్ట నుంచి ఏదో మూలుగు వినిపించడం గమనించాడు. పుట్టలో ముని ఎవరో

బిందుసార్



ఉండవచ్చని ఆయన ఊహించాడు. కదలా మెదలక చిరకాలం తపస్సు చేసుకుంటూన్న ముని చుట్టూ పుట్ట ఏర్పడి ఉండవచ్చని భావించి, తన మనుషులతో నెమ్మదిగా పుట్ట మన్నును తొలగించాడు. ముని బయటికి వచ్చాడు. సుకన్య పుట్టలోకి పొడిచిన ముల్లు ముని కళ్ళకు గుచ్చుకుని అంధుడైపోయాడు. సరిగ్గా ముని తపస్సు ముగించి కళ్ళు తెరిచిన సమాయానికే సుకన్య ఆ పొరబాటు చేసింది. బాధతో ముని ఇచ్చిన శాపం కారణంగానే సైనికులు వింత వ్యాధితో బాధపడుతున్నారు!

ఆయన చ్యవనుడనే గొప్ప మునిపుంగవుడు. రాజదంపతులు ముని పాదాలకు సాష్టాంగ నమస్కారంచేసి, శాపవిముక్తి కలిగించమని వేడుకున్నారు. అప్పటికే అంధుడైపోయిన ముని, తప్పు చేసినవారు తగిన ప్రాయశ్చిత్తం చేసినట్టయితే, శాపం తొలగిపోతుందని సెలవిచ్చాడు.

మునిని రాజభవనానికి తీసుకువెళ్ళి జీవితాంతం సకలవిధ సదుపాయాలు కల్పిస్తానని రాజు చెప్పాడు. అయితే ముని అందుకు సమ్మతించలేదు. యువరాణి స్వయంగా ప్రాయశ్చిత్తం చేయాలన్నాడు. ఆమె మూలంగా తాను చూపు కోల్పోయాడు గనక, ఆమె అడవిలోనే ఉండి తనకు భార్యలా సేవలు చేయాలన్నాడు.

ముని కోరిక విని రాజదంపతులు దిగ్భ్రాంతి చెందారు. ముని ఎంతటి గొప్పవాడైనప్పటికీ, అల్లారుముద్దుగా పెంచి ఏ రాజకుమారుడికో ఇచ్చి వివాహం చేయాలనుకున్న తమ గారాలపట్టిని కళ్ళులేని ముదుసలికి కట్టబెట్టడానికి ఎలా మనసొప్పుతుంది? అయితే, యువరాణి ముందుకు వచ్చి తండ్రితో, ''ఏకాంతమంటే నాకు ఎప్పుడూ ఇష్టమే. పైగా, ముని భార్యలా జీవించాలనే కోరిక నాలో చిరకాలంగా ఉంది. దానిని రహస్యంగా దాచాను. నా కోరిక తీరడానికి కావలసిన పరిస్థితులను విధి ఇప్పుడు ఇలా సృష్టించింది. మునిని వివాహమాడి, ఆయనకు సేవలు చేయడానికి నన్ను అనుమతించి, ఆశీర్వదించండి,'' అని తల్లిదండ్రులకు సజల నయనాలతో నమస్కరించింది.

ముని శాపం మిగిలినవారికి కూడా వ్యాపిస్తూండడంతో, రాజదంపతులకు, కుమార్తె కోరికను మన్నించడం తప్ప మరోమార్గం కనిపించలేదు. సుకన్య సర్వ భోగభాగ్యాలనూ త్యజించి, చ్యవన మునిని వివాహమాడింది. సైనికుల శాపం తొలగిపోయింది. రాజదంపతులు బరువెక్కిన హృదయాలతో రాజధానికి చేరారు.

సుకన్య ఒంటరిగా చ్యవనుడివెంట ఉంటూ భక్తితో పరిచర్యలు చేయసాగింది. ఆమె ఒకనాడు దాపులనున్న తటాకంలో స్నానం చేసి వస్తూండగా ఇద్దరు దివ్యపురుషులు ఎదురుపడ్డారు. చూడడానికి ఇద్దరూ ఒకే విధంగా ఉన్నారు. వాళ్ళు సుకన్యను చిరునవ్వుతో పల

కరించి, ''ఓ అందాలరాశీ! ఒక వృద్ధుడితో కాపురంచేస్తూ నువ్వు నీ జీవితాన్ని వృధా చేయడం మాకు బాధ కలిగిస్తున్నది. మేము కవలలము. అశ్వినీకుమారులు మా పేర్లు. మేము దేవతలకు వైద్యులం. నీకు ఇష్టమైతే మా ఇరువురిలో ఒకరిని నీ భర్తగా స్వీకరించి సంతోష జీవితం సాగించవచ్చు,'' అన్నారు.

సుకన్యకు పట్టరాని ఆగ్రహం కలిగింది. వాళ్ళను శపిస్తానన్నది. కాని, అశ్వినీదేవతలు తమ దుందుడుకు చర్యకు క్షమాపణలు చెప్పుకున్నారు. ''మా దగ్గరున్న ఒక రహస్య రసవాదం ద్వారా ముసలివాడైన నీ భర్తను నవ యువకుడిగా మార్చగలం. పోయిన చూపు కూడా తిరిగి వస్తుంది. అందుకు ఆయన చేయవలసిందల్లా, మాతో వచ్చి ఈ తటాకంలోకి దిగి ఒకసారి మునిగి పైకి లేవాలి. అయితే, మేము నీళ్ళనుంచి వెలుపలికి వచ్చాక, నీకొక పరీక్ష ఉంటుంది.అందుకు నీకు సమ్మతమేనా?'' అని అడిగారు.

సుకన్య తన భర్తకు రేయింబవళ్ళు పరిచర్యలు చేస్తున్నప్పటికీ, ఆయన చూపు పోవడానికి కారణం తానే అన్న అపరాధ భావం ఆమెను ఎప్పుడూ వేధిస్తూనే ఉంది. ఇప్పుడు ఆయనకు చూపు వచ్చే అవకాశాన్ని చేజారవిడుచుకో కూడదని నిర్ణయించింది. అందువల్ల, అశ్వినీ కుమారుల పరీక్షకు నిలబడాలనుకున్నది. అయితే, భర్త అందుకు అనుమతించాలికదా? వెళ్ళి సంగతి చెప్పింది. అశ్వినీదేవతలు పెట్టనున్న పరీక్ష ఎలాంటిదో సుకన్యకు గానీ, చ్యవనుడికి గానీ తెలియదు. అయినప్పటికీ, సుకన్య పరీక్షను ఎదుర్కోవడానికి ముని అనుమతించాడు.

అశ్వినీదేవతలూ, చ్యవనమునీ తటాకంలోకి దిగారు. 'మేము నీళ్ళలోకి మునిగి పైకి లేచాక, నువ్వు నీ భర్తను చేయిపట్టి స్వీకరించాలి,'' అని సుకన్యను హెచ్చరించారు అశ్వినీ దేవతలు.

ఆ తరువాత ముగ్గురూ నీళ్ళలోకి మునిగారు. కొంతసేపటికి పైకి లేచినప్పుడు ముగ్గురూ ఒకే రూపాలతో ఉన్నారు. ఆ ముగ్గురిలో ముని ఎవరని తెలుసుకోవడానికి మానవమాత్రులకు సాధ్యమయ్యే పనికాదు. అయితే సుకన్య మామూలు మనిషి కాదుకదా. అశ్వినీదేవతలు తన మీద ప్రయోగిస్తున్న ఉపాయాన్ని గ్రహించింది. ఆమె కళ్ళుమూసుకుని జగన్మాతను స్మరించి, ఆ ముగ్గురిలో ఒకరి చేయి పట్టుకున్నది. ఆయనే ఆమె భర్త చ్యవనుడు!

సుకన్యా చ్యవనులు తమ సమయాన్ని ఆధ్యాత్మిక అభ్యున్నతికి వినియోగిస్తూ, చిరకాలం సుఖసంతోషాలతో జీవించారు.





# నవ్వు - అందం

సిరిపురంలో శ్రీధవుడనే భాగ్యవంతుడున్నాడు. ఆయన కూర్చుని తిన్నా తరతరాలు తరగని ఆస్తివున్నా, నిత్యం వదలిపెట్టకుండా వేధించే సమస్య ఒకటున్నది. ఆయన చూపులకు పరమవికారంగా ఉంటాడు!

తన రూపం అందంగా మారాలని వైద్యులు చెప్పిన రకరకాల మూలికలు మింగాడు. ముఖానికి ఏవేవో పసర్లు పూసుకున్నాడు. ఎందరోదేవుళ్ళకు పూజలు చేశాడు. ఏమాత్రం ప్రయోజనం కలగలేదు.

ఒక బైరాగి, శ్రీధవుడి తీరని సమస్య గురించి విని, "నాయనా! ఈ రూపం నీకు దేవుడిచ్చినది. దీన్ని మార్చాలనుకోకు. దైవ కృపవల్ల నీవద్ద తరగని నిధి వున్నది. దాన్ని ఉపయోగించి, ఇతరులకు మేలు కలిగే మంచి పనులు చేయి. అప్పుడు, అందరికీ నీరూపం తప్పక అందంగా కనబడుతుంది," అన్నాడు.

తన డబ్బును తనకే తప్ప ఇతరుల కోసం ఖర్చు చేయడం, శ్రీధవుడికేమాత్రం ఇష్టం లేదు. అందుకని, ఆయన బైరాగిని మరేదైనా ఉపాయం చెప్పమని కోరాడు. బైరాగి కాసేపు ఆలోచించి, "హరిపురంలో వున్న మాధవుడు, నీకంటే వికారంగా కనిపిస్తాడు. కొన్నాళ్ళు అతడివెంట వుంటే, నీ రూపం నీకే అందంగా కనబడుతుంది. ఎంత పెద్దగీత అయినా, ఇంకాస్త పెద్దగీత పక్కన చిన్నదే కదా!" అన్నాడు.

ఈ సలహా శ్రీధవుడికి నచ్చింది. ఆయన కొంత డబ్బు తీసుకుని హరిపురం వెళ్ళి, మాధవుణ్ణి కలుసుకున్నాడు. మాధవుడు నిజంగానే పరమవికారంగా వున్నాడు. అతణ్ణి

జొన్నలగడ్డ రామలక్ష్మి

చూడగానే, శ్రీధవుడికి పరమానందం కలిగింది. వెంటనే తనతో సిరిపురం వచ్చేయమని మాధవుణ్ణి కోరాడు.

మాధవుడు పేదవాడు. అతడికి పూటగడవడం కష్టంగా ఉన్నది. రెక్కాడితేగానీ డొక్కాడని అతడికి, శ్రీధవుడు రోజూ వూరికే కూర్చోబెట్టి తిండిపెట్టి పోషిస్తానన్నాడు. అయినా, అతడు రాననేసరికి, శ్రీధవుడాశ్చర్యపడి కారణమడిగాడు.

"ఈ ఊళ్ళో అందరికీ నేనంటే ఎంతో ఇష్టం. ఇక్కడ నేనెంతో సంతోషంగా వున్నాను. అందువల్ల, ఈ ఊరొదిలిపెట్టి రాను," అన్నాడు మాధవుడు.

డబ్బున్న తనకులేని సంతోషం మాధవుడికెలావచ్చిందా అని, శ్రీధవుడు మరింత ఆశ్చర్యపడ్డాడు. అదీకాక, డబ్బులేని మాధవుణ్ణి ఊరంతా అభిమానిస్తుందన్న విషయం కూడా ఆయన ఏమాత్రం నమ్మలేదు. అందువల్ల, మాధవుణ్ణి గురించి ఊళ్ళో నలుగురినీ అడిగి చూశాడు.

మాధవుడు పరోపకారి అని కొందరన్నారు. మంచివాడనికొందరన్నారు.మహాభక్తుడన్నారు మరికొందరు.నిస్వార్థపరుడని కూడా అన్నారు. కాని, కురూపి అని ఒక్కరు కూడా అనలేదు. ఉండబట్టలేక శ్రీధవుడే ఆ ప్రసక్తి తేగా, ఒకాయన, "ఏమో, వాణ్ణి చూడగానే వాడి మంచి బుద్ధులే గుర్తొస్తాయి. రూపం గురించి ఎవరూ ఆలోచించడం లేదు," అనేశాడు.

ఆమాట నిజమే! ఆ ఊళ్ళోనే పాలమ్ముకుని జీవించే సుగుణ అనే అందాలభరిణ, ఏరికోరి మాధవుణ్ణి పెళ్ళిచేసుకుంటానన్నది. శ్రీధవుడు వెళ్ళి సుగుణను కలుసుకుని, ఆమె



అందం చూసి మూర్ఛపోయాడు. ఆ పిల్ల, ఆయన ముఖం మీద నీళ్ళుచల్లి స్పృహ తెప్పించి, "ఏమైంది నీకు?" అని అడిగింది.

"నువ్వు గొప్ప అందగత్తెవు. నిన్ను నేను పెళ్ళిచేసుకుంటాను. ఆ తర్వాత నుంచి నువ్వు పాలమ్ముకోనక్కరలేదు. నా దగ్గర తరగని సంపదవుంది. నువ్వు మహారాణిలా జీవించవచ్చు!" అన్నాడు శ్రీధవుడు.

"నేను మాధవుణ్ణి ఇష్టపడ్డాను. వాడితోనే నాపెళ్ళి," అన్నది సుగుణ.

"మాధవుడు నాకంటే అందగాడు కాదు. నాలాగా డబ్బున్నవాడు అసలే కాదు. నన్ను కాదని వాడంటే ఇష్టపడతావేం?" అన్నాడు శ్రీధవుడు కోపంగా.

"ఏమో! వాడెప్పుడూ నవ్వుతూ ఉంటాడు. వాడి నవ్వు నాకు చాలా ఇష్టం. నవ్వినప్పుడు

వాడు ఎంతో అందంగా వుంటాడు,'' అన్నది సుగుణ.

శ్రీధవుడు, తనూ నవ్వాలనుకున్నాడు; నవ్వు రాలేదు. ఆయన మాధవుణ్ణి వెతుక్కుంటూ వెళ్ళి, తనకు నవ్వడం నేర్పమన్నాడు. దానికి మాధవుడు, ''నీ గురించి తక్కువగానూ, ఇతరుల గురించి ఎక్కువగానూ ఆలోచించడం అలవరచుకో. మనం మనగురించే ఆలోచించుకుంటే, ఏదో కొద్ది క్షణాలపాటు సంతోషపడతాం. అలాకాక, ఇతరుల మంచికి సంతోషపడితే అన్నివేళలా ఆనందమే!'' అన్నాడు.

ఇతరుల గురించి ఆలోచించడం, తన వల్లకాదన్నాడు శ్రీధవుడు. ''అయితే, ఈ ఊరి చివరవున్న మామిడి తోటలోని నిత్యానంద స్వామి దగ్గరకు వెళ్ళు. ఆయన నీకు నవ్వువచ్చే హాస్యకథలు చాలా చెబుతాడు. అవి గుర్తు చేసుకుంటే చాలు పొట్టచెక్కలయ్యేటంత నవ్వొస్తుంది,'' అని చెప్పాడు మాధవుడు.

శ్రీధవుడు, నిత్యానందస్వామిని దర్శించి ఆయన చెప్పిన హాస్యకథలు విన్నాడు. అప్పుడు నిజంగానే ఆయనకు పొట్టచెక్కలయ్యేటంత నవ్వొచ్చింది. ఆయన్ని చూస్తూ నిత్యానందస్వామి కథలు చెప్పడం ఆపి చాలాసేపు నవ్వాడు.

''మీ కథలకు మీకే నవ్వు రావడం విచిత్రంగా వుంది, స్వామీ!'' అన్నాడు శ్రీధవుడు ఆశ్చర్యపోయి.

నిత్యానందస్వామి నవ్వడం ఆపి, ''నేను నా కథలకు నవ్వడం లేదు. నీ పొట్ట కదిలిపోతున్నదిగానీ నీ ముఖంలో నవ్వులేదు. అది చూసి నేను నవ్వాపుకోలేకపోయాను,'' అన్నాడు. ''అయ్యో, నేను నవ్వాను, స్వామీ! అలా నవ్వినప్పుడే నా పొట్టకదిలింది,'' అన్నాడు శ్రీధవుడు అసంతృప్తిగా.

''అలాగా! అయితే నవ్వినా, నీ ముఖంలో తేడా లేదు. నీ మనసులోని స్వార్థభావాలే వికారంగా వెలువడుతున్నాయి. అందుకే నీ నవ్వు తెలియడం లేదు, ఏం చేయగలం మరి!'' అన్నాడు నిత్యానందస్వామి సాలోచనగా.

శ్రీధవుడికి అప్పటికి విషయం పూర్తిగా అర్థమైంది. ఆయన సిరిపురం తిరిగివెళ్ళి, ఊళ్ళో పదిమందికీ మేలుకలిగే పనులు చేయడం మొదలుపెట్టాడు. ఆ తర్వాత ఆయనను తను కురూపినన్న వాస్తవం ఏమాత్రం బాధించలేదు.



# మీకు తెలుసా?

మనదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన రోజు ఆగస్టు పదిహేను. ఈ నెల ప్రశ్నలు స్వాతంత్ర్యానికి పూర్వం, ఆ తరవాతి కొన్నివిశేషాలను గుర్తు చేస్తాయి.

1. స్వతంత్ర భారత తొలి బడ్జెట్‌ను ఎవరు సమర్పించారు?
2. అతి స్వల్పకాలం మాత్రమే పదవిలో ఉన్న భారత రాష్ట్రపతి ఎవరు?
3. వయోజన ఓటింగ్ హక్కును 21 నుంచి 18 సంవత్సరాలకు ఎప్పుడు తగ్గించారు?
4. 'జయ్ జవాన్, జయ్ కిసాన్' నినాదానికి 'జయ్ విజ్ఞాన్' మాటనుకూడా చేర్చిందెవరు?
5. పార్లమెంటులో అవిశ్వాసతీర్మానాన్ని ప్రవేశపెట్టడానికి కనీసం ఎంతమంది సభ్యులు ఉండాలి?
6. ఉపరాష్ట్రపతి, రాజ్యసభ అధ్యక్షుడుగా సమావేశాలను నిర్వహిస్తారు. మరి ఆయన లేనప్పుడు ఆ బాధ్యతలను ఎవరు నిర్వహిస్తారు?
7. భాషాప్రయుక్త రాష్ట్రంగా ఏర్పడిన మొట్టమొదటి రాష్ట్రం ఏది?
8. మలయాళం మాట్లాడే ఒక ప్రాంతం కేరళరాష్ట్రంలో లేదు. అది ఏ ప్రాంతం? ఏ రాష్ట్రంలో ఉంది?
9. గోమతేశ్వర ఏకశిలా విగ్రహం ఏ రాష్ట్రంలో ఉంది?
10. అతి చిన్న కేంద్రపాలిత ప్రాంతం ఏది?
11. భారతదేశంలోని మొట్టమొదటి వ్యవసాయ విశ్వవిద్యాలయం ఏది?
12. భారతదేశ అతిప్రాచీన జాతీయ ఫుట్‌బాల్ ఛాంపియన్‌షిప్ పేరేమిటి?
13. అండమాన్ నికోబార్ దీవుల సముదాయాలకు నేతాజీ సుభాష్ చంద్రబోస్ కొత్తపేర్లు పెట్టాడు. ఆ పేర్లేమిటో తెలుసా?
14. బెంగాల్ విభజన జరిగినప్పుడు భారతదేశపు వైస్రాయ్‌గా ఎవరు ఉన్నారు?

(సమాధానాలు వచ్చే సంచికలో)

### జూలై క్విజ్ సమాధానాలు

1. గోదావరి
2. సిమ్లా
3. సిమ్లా
4. మర్రిచెట్టు
5. గడ్డి
6. అద్దకం పనుల పద్ధతి
7. జెమ్‌షెడ్‌పూర్



# మానవసేవే మాధవసేవ

రాజవరం అనే గ్రామంలో, లింగరాజు అనే వైద్యుడుండేవాడు. మాణిక్యం, ఆయన భార్య; పిల్లలు లేరు. లింగరాజు మూలికా వైద్యంలో దిట్ట. ఎటువంటి గుప్తరోగాన్నయినా పసిగట్టి, సరైన మందుతో నయం చేయగలడని పేరు బడ్డాడు. వాళ్ళిచ్చినది సంతోషంగా తీసుకునేవాడు. ఈ విధంగా ఎలాంటి లోటూ లేకుండా జీవిస్తూ, కొంతసొమ్ము కూడా వెనకేసుకున్నాడు.

పిల్లలు లేనందుకు మాత్రం మాణిక్యం తెగ బాధపడిపోయేది. ఆమె మొక్కని దేవుడు లేడు, చెయ్యని వ్రతం లేదు. ఒకనాడు ఆమె, లింగరాజుతో, "మీ వైద్యశాస్త్రం నా విషయంలో మాత్రం ఎందుకూ కొరగాకుండా పోయింది? అసలు నాకు పిల్లలు పుట్టే యోగం ఉన్నదో లేదో తెలుసుకోవాలని వుంది. అంతర్వేది క్షేత్రానికి వెళదాము, ఆ స్వామిని సేవించి, ఒకరాత్రి అక్కడున్న సంతాన మంటపంలో నిద్ర చేద్దాము. ఆ స్వామి మనకు కలలో పండ్లు, పుష్పాలు చూపిస్తే పిల్లలు పుడతారని చెప్పుకుంటున్నారు," అన్నది.

ఇందుకు లింగరాజు కొద్దిసేపు ఆలోచించి, "అంతర్వేది స్వామి లక్ష్మీనరసింహుడు. మన పూర్వజన్మసుకృతం ఎలా వున్నప్పటికీ, సంతాన ప్రాప్తి కలిగినా కలగకపోయినా, దైవదర్శనం సర్వపాపహారం కాబట్టి, మనం తప్పకుండా అంతర్వేది వెళదాం," అన్నాడు.

లింగరాజు వెళదామని మాటైతే అన్నాడు కాని, అంతర్వేది క్షేత్ర దూరాన్ని లెక్కకట్టి బెంగ పడ్డాడు. అక్కడికి చేరాలంటే కొంతదూరం నేలమార్గాన, ఆ తర్వాత నదిలో పడవ మీద వెళ్ళాలి. ఇందుగ్గాను దారి ఖర్చులకు సొమ్ము భారీగా అవసరం అవుతుంది. తాను వైద్య వృత్తిలో ఇంతకాలంగా వెనకేసిన సొమ్ము పూర్తిగా ఖర్చయిపోతుంది.

డా. జొన్నలగడ్డ మార్కండేయులు

ఈ విషయం లింగరాజు, భార్య మాణిక్యానికి చెప్పి, "ఆలోచించి చూడు. ఏం చేద్దామంటావు?" అని అడిగాడు.

మాణిక్యం కాసేపు మౌనంగా వూరుకుని, "ఒకపని చేద్దామండీ! మనం ఈ అంతర్వేది ప్రయాణానికి ముందు సత్యనారాయణ వ్రతం చేసుకుందాం. గ్రామంలో అందరినీ పిలుద్దాం. స్వామి అనుగ్రహిస్తే, మనచేత వైద్యం చేయించుకున్నవారు కానుకగా ఎంతో కొంత చదివించక పోరు. స్వకార్యం కోసం స్వామివారి పేరును ఉపయోగించుకోవడం తప్పే అయినా, ఇది లోకంలో జరుగుతున్న ఆచారమే తప్ప, మనం కొత్తగా ప్రారంభించినది కాదు," అన్నది.

భార్య చెప్పిన ప్రకారమే లింగరాజు, సత్యనారాయణ వ్రత కారణాన్ని చెప్పి గ్రామంలో అందరినీ ఆహ్వానించాడు. ధనాశ లేని వైద్యుడుగా పేరుపొందిన లింగరాజు మీద గ్రామస్థులు తమ అభిమానాన్ని బాగానే చూపారు. కానుకలుగా ధనరూపేణా వచ్చిన సొమ్ము, తన దగ్గిరున్న సొమ్ము కలిపితే, రెండు పేద కుటుంబాలకు మంచి పూరి ఇళ్ళు కట్టించి ఇవ్వవచ్చు, అని లింగరాజు నవ్వుకుని, భార్యతో, "వైద్యుడుగా నా ప్రతిభను గుర్తించారో లేక అంతా ఆ స్వామి దయో అయోమయంగా వున్నది!" అన్నాడు.

మాణిక్యం ఏమీ మాట్లాడలేదు. రెండు మూడు రోజులుగా అడపాదడపా కురుస్తున్న చిన్నవాన, ఆ రాత్రి పెద్ద ముసురుగా తయారై కుంభవృష్టిగా కురిసింది. అది తెల్లవారింత ర్వాత కూడా ఆగక మూడు రోజులపాటు విడవకుండా కురిసి గ్రామాన్ని జలమయం చేసింది. నాలుగవ రోజున సూర్య దర్శనమైంది.

లింగరాజు, మాణిక్యం బయటికి వచ్చి చూస్తే చుట్టుపక్కల అంతా బీభత్సంగా ఉన్నది. కూలిపని చేసుకుని బతికే గురవయ్య, వాడి భార్య, ఆరేళ్ళ కొడుకు, మూడేళ్ళ కూతురు



- ఎదురుగా వున్న పెద్ద వేపచెట్టుకింద తడిసి ముద్దయి కనిపించారు. మూడు రోజులుగా కురిసిన వానదెబ్బకు, వాడి గుడిసె కూలి పోయింది.

లింగరాజు, గురవయ్య పరిస్థితి చూసి చలించిపోయాడు. ఆయన గురవయ్యను, వాడి కుటుంబాన్నీ ఇంట్లోకి రమ్మని పిలిచి, అందరికీ కట్టుకోవడానికి పొడిబట్టలు ఇచ్చాడు. మాణిక్యం అప్పటికప్పుడు ఆదరాబాదరా వండి వాళ్ళందరికీ అన్నం పెట్టింది. మూడు రోజుల పాటు ఆ కుటుంబం వానకు తడుస్తూ చెట్టు కింద కాలం గడిపారని విని, ఆమె తల్లడిల్లి పోయింది. కూలిన గుడిసె తిరిగి కట్టుకోవడం గురవయ్యకు సాధ్యం కాదు!

మాణిక్యం, భర్తను పక్కకు పిలిచి, "గుర వయ్య పిల్లల స్థితి చూస్తూంటే కడుపు తరుక్కుపోతున్నది. పిల్లలకోసమని నేను, అంత ర్వేది లక్ష్మీనరసింహస్వామిని దర్శించాలనుకున్నాను. దీనస్థితిలో వున్న ఈ పిల్లల్ని ఆదుకోలేని నేను, పిల్లల కోసం మొక్కడం చూస్తూంటే నవ్వొస్తున్నది. పిల్లలు పుడతారో లేదో తెలియని క్షేత్రానికి నమ్మకంతో వెళ్ళి మన సొమ్ము వృధా చేసేకంటే, అందుకయ్యే ఖర్చుతో గురవయ్యకు చిన్నిల్లు కట్టించి ఇవ్వండి," అన్నది.

భార్యమాటలకు లింగరాజు చాలా ఆనంద పడ్డాడు. ఆయన దగ్గరుండి, వారం తిరక్కుండా గురవయ్యకు చక్కని పూరి ఇల్లు కట్టించాడు. గృహప్రవేశం చేస్తూ గురవయ్య కుటుంబం, లింగరాజు దంపతులకు నమస్కరించి కృతజ్ఞతలు చెప్పారు.

గురవయ్య తన కొత్త ఇంట ప్రవేశించిన రాత్రి మాణిక్యానికి ఒక కల వచ్చింది. ఆ కలలో ఒక దివ్యపురుషుడు, ఆమెకు పూలు, పండ్లు ఇచ్చి, "సాటి మానవుడికి కష్టకాలంలో సహాయపడడం అనేది, ఎంతో మార్గప్రయాసకోర్చి అంతర్వేది లక్ష్మీనరసింహస్వామిని దర్శించినంతపుణ్యం ఇస్తుంది. మానవసేవే మాధవ సేవ. అందుకే ఈ పూలు, పండ్లు ఇస్తున్నాను!" అన్నాడు.

తన కల గురించి మెలుకువ వచ్చాక భర్తకు చెప్పింది, మాణిక్యం. ఒక ఏడాది లోపులోనే లింగరాజుకు సంతోషం కలిగిస్తూ మాణిక్యం, ఒక మగపిల్లవాణ్ణి కన్నది.



# మీరే చేసుకోవచ్చు



## ఒంటికొమ్ము ఖడ్గమృగం

ఏనుగు తరవాత ఆకారంలో చాలా గంభీరంగా కనిపించే జంతువు ఖడ్గ మృగం. జంతు ప్రదర్శనశాలలకు వచ్చే పిల్లల్ని అబ్బురపరిచి అమితంగా ఆకర్షించే జంతువుల్లో ఖడ్గమృగం ఒకటి. ఈశాన్య భారతదేశంలో ఎక్కువగా కనిపించే ఒంటికొమ్ము ఖడ్గమృగం రేఖాచిత్రాన్ని దళసరి అట్టమీద ముద్రించి, ఉత్సాహవంతులైన పిల్లలకోసం కానుకగా అందిస్తున్నాము. దీంతో మీరే ఒక ఒంటికొమ్ము ఖడ్గమృగం బొమ్మను సులభంగా తయారు చేసుకోవచ్చు. ఇక్కడ ఇచ్చిన సూచనల ప్రకారం తయారుచేయడం మొదలుపెట్టండి మరి.

రేఖాచిత్రాన్నిఅనుసరించి అట్టమీది అదనపు భాగాలను తొలగించి, మృగం శరీరభాగాలను జాగ్రత్తగా విడివిడిగా కత్తిరించుకోవాలి. మృగం శరీరంలో చిన్న నల్లటి గీతలు ఉన్న చోట్లలో పంచింగ్ చేయబడి ఉన్నాయి. అలా లేనట్టయితే, ఆ భాగాలలో చిన్న కత్తితోగానీ, బ్లేడుతోగానీ, సన్నగా గాడిలా కత్తిరించుకోవాలి. (నం. 1) మొదట శరీరభాగాన్నీ (నం. 1), తరవాత వీపు చివరి భాగాన్నీ (నం. 2) ఆ తరవాత వీపుమీది కవచాలనూ (3, 4) చిత్రంలో చూపిన సూచనలప్రకారం లోపలివైపుకు మడుచుకోవాలి. నం. 2, 3, 4 భాగాలకు కురచగా ఉన్న తెల్లటి అంచులను మడిచి, సరైన స్థానాలలో దూర్చి, జంతు అవయవాలుగా అమర్చాలి.




మొదట జంతు శరీరభాగాన్నీ (నం. 1) ఆ తరవాత వీపునూ, వీపుమీది రెండు కవచాలను మడిచి సరైన స్థానంలో దూర్చి, అమర్చుకోవాలి. ఆ తరవాత తలను (నం. 5) మడిచి మెడ భాగంలో దూర్చి అమర్చుకోవాలి. ఆ తరవాత చెవులను (నం. 6) దూర్చి అమర్చుకోవాలి. ఆఖరుగా రెండుగా వున్న తోకను (7) ఒకటిగా చేర్చి అతికించాక, దానిని జంతువు వెనకవైపు ఉండవలసిన చోట అతికించుకోవాలి. ఆహా, ఇప్పుడు ఒంటికొమ్ము ఖడ్గమృగం మీ చేతులతోనే తయారయిందన్న మాట!




## జీవితమే ప్రయాణం!



ప్రయాణాలు చేయడం అంటే అందరికీ ఇష్టమే. మీకూ ఇష్టమే కదా? అయితే, జీవితకాలమంతా ప్రయాణంగానే ఉంటే ఎలా ఉంటుందో ఊహించి చూడండి. జమ్మూ-కాశ్మీర్‌లో మంచు కప్పిన హిమాలయ శిఖరాలమధ్య గుజ్జార్ తెగవాళ్ళున్నారు. వాళ్ళెప్పుడూ సంచారం చేస్తూనే ఉంటారు. మన దేశంలోని సంచార తెగలలో వీళ్ళు ముఖ్యమైన వాళ్ళు. గుర్రాలమీద దుప్పట్లనూ, తివాసీలనూ, గోనె సంచీలనూ వేసుకుని యేడాదికి కొన్ని వందల కి. మీ. సంచారం చేసే వీళ్ళు గుడారాలు వేసుకుని నివసిస్తారు. గుజ్జార్లు తమ బంధుమిత్రులతో నవంబర్-మార్చ్ నెలలమధ్య జమ్మూలోని రియా, రాజోరి, పూంఛ్ కొండల ప్రాంతంలో సమావేశమౌతారు. ఏప్రిల్ నెలారంభంలో మళ్ళీ హిమాలయాలలోని ఎత్తయిన మైదానాలకు వలస వెళతారు. సెప్టెంబర్ రాగానే మళ్ళీ అక్కణ్ణించి మూటాముల్లె సర్దుకుని జమ్మూలోని తమ శీతాకాల నివాసాలకు తిరిగి చేరుకుంటారు.

## కాపలా దేవుడు!

తమిళనాడు సముద్రతీరంలో చెన్నయ్‌కి సమీపంలో ఉన్న మీటాన్‌కుళం గ్రామవాసులకు తాము కొలిచే మునియప్పసామి మీద అపారమైన భక్తి. ఆ దేవుడే తమ ఇళ్ళకు కాపలాకాయగలడన్న నమ్మకంతో దాదాపు 132 గడపలున్న ఆ గ్రామంలో ఒక్క ఇంటికి కూడా తలుపులు అమర్చలేదు.

ఇంతవరకు ఈ గ్రామంలో ఒక్క దొంగతనం కూడా జరగలేదని గ్రామస్థులు చెబుతున్నారు. ఎవరైనా తమ ఇంటికి తలుపు అమర్చుకుంటేనో లేక ఇంటి కొబ్బరాకుల కప్పును తొలగించి దృఢమైన కప్పు వేస్తేనో మునియప్పసామి ఆగ్రహానికి గురికాగలరని కూడా ఆ పల్లె ప్రజలు విశ్వసిస్తున్నారు. రెండువందల యేళ్ళనాటి మునియప్పసామి గుడికి కూడా తలుపులు లేవు. పైకప్పు కూడా అంతంత మాత్రంగానే ఉంది.





# చెరువు తవ్వకం

సీతాపురానికి రమణయ్య గ్రామాధికారి. ఒక సంవత్సరమంతా వానలు లేక, ఆ ఊరికి కరు వొచ్చింది. ఊరికి నీటి కరువు మళ్ళీ మళ్ళీ రాకూడదని ఆలోచించి, ఆ ఊళ్ళో ఒక పెద్ద చెరువు తవ్వించాలనుకున్నాడు, రమణయ్య. ఊరుమ్మడి నేలలో ఒకచోట చెరువు తవ్వాలన్న నిర్ణయం జరిగాక, అందుకు రాజుగారి అను మతీ, నిధులూ కూడా లభించాక, పని తొంద రగాజరగాలని,మొత్తం రెండువందల మంది పనివాళ్ళను నియమించడం జరిగింది.

చెరువుపని ప్రారంభమైంది కానీ చురుగ్గా సాగడంలేదు. కొందరు పనివాళ్ళు వేళకు వచ్చేవాళ్ళుకాదు. కొందరు ఏదో పనివుందని బయటకు వెళ్ళి వస్తూండేవారు. కొందరు పనిని ఆపి కబుర్లు చెప్పుకునేవారు. చాలా మంది ముందే ఏదో వంకచెప్పి వెళ్ళిపోతూండే వారు. రెండు నెలలు గడిచినా రెండడుగుల గొయ్యికూడా ఏర్పడలేదు. ఈలోగా ఆ ఊరుకు భూషయ్య అనే ఆయన వచ్చాడు.

భూషయ్య భాగ్యవంతుడు. కరువు కార ణంగా ఆ ఊళ్ళో చాలామంది పొలాలమ్ము కుని వలస వెళ్ళిపోతున్నారని తెలిసి, ఆయన అక్కడకు వచ్చి చవక ధరకు ఊళ్ళోని మూడో వంతు పొలాలు కొనేశాడు. తన పొలాలకు నీటి ఎద్దడి ఉండకూడదని ఆయన కూడా తన పొలాలమధ్య పెద్ద చెరువు తవ్వించాలను కున్నాడు. పరిమాణంలో అది గ్రామాధికారి తవ్విస్తున్న చెరువుకంటే పెద్దది. దాని కాయన నూరు మంది పనివాళ్ళను మాత్రమే తీసుకు న్నాడు.వాళ్ళు నెలరోజుల్లో గ్రామాధికారి చెరువుకంటే మూడు రెట్లు లోతుకు నేలను తవ్వారు.ఇది రమణయ్యకు చెప్పలేని ఆశ్చ ర్యాన్ని కలిగించింది.

ఈ తేడా ఎక్కడొచ్చిందీ అని రమణయ్య ఆరా తీయించాడు. పనివాళ్ళకు భూషయ్య కంటే రోజుకు తానిస్తున్న జీతమే ఎక్కువ. పనివాళ్ళ సంఖ్యకూడా తనదే ఎక్కువ. కాన యితే భూషయ్య పనివాళ్ళు వేళకు వచ్చి

శ్రీరామకమల్

పనిచేసి వేళకు వెళుతున్నారు. మధ్యలో కబుర్లాడుకోరు. రోజంతా శ్రద్ధగా పనిచేస్తారు.

పనివాళ్ళను అదుపు చేయాలని రమణయ్య, తవ్వుతున్న చెరువు చుట్టూ కంచె కట్టించాడు. అందుకు రెండు వారాలు పట్టింది. ఆ కంచెకు ఒక మూలగా తలుపు పెట్టాడు. అక్కడొక కాపలావాడిని వుంచాడు. పనికి ఆలస్యంగా వచ్చిన వారిని లోపలకు రానివ్వకూడదన్న నియమం పెట్టాడు. సరిగా పని చేయనివారికి జీతం లేదన్నాడు. పని మధ్యలో కానీ, పని ముగిసేవేళకు ముందు కానీ ఎవరూ బయటకు పోరాదని నియమం విధించాడు. పనివాళ్ళు కబుర్లు చెప్పుకోకుండా కొందరిని కాపలా పెట్టాడు.

ఇదంతా చేశాక పనివాళ్ళకు వేళకు వచ్చి వేళకు వెళ్ళడం అలవాటయింది. వాళ్ళలో వాళ్ళు కబుర్లు చెప్పుకోవడమూ తగ్గింది. అయితే పని వేగం మాత్రం పెద్దగా పెరగలేదు.

ఇందులో ఏదో మర్మమున్నదనిపించి, రమణయ్య చివరకు పోయి భూషయ్యను కలుసుకుని తనగోడు వెళ్ళబుచ్చుకున్నాడు.

"తేడా పనివాళ్ళలో లేదు; నీలోవుంది! చెరువు తవ్వకానికి నువ్వు రాజుగారి నిధులు ఖర్చు చేస్తున్నావు. నేను నా డబ్బు ఖర్చుపెడుతున్నాను," అన్నాడు భూషయ్య.

"అయితే మాత్రం, పని చేసేది పనివాళ్ళే కదా! తేడా వాళ్ళలోనే వుండివుండాలి," అన్నాడు రమణయ్య.

భూషయ్య తల అడ్డంగా ఊపి, "డబ్బు రాజుగారిది కాబట్టి, నువ్వు రోజు కింత అని పనివాళ్ళకు జీతమిస్తున్నావు. డబ్బు నాది కాబట్టినేను, పనికింత అని వాళ్ళకు జీతమిస్తున్నాను. నీ పద్ధతి ప్రకారం పనికెన్నిరోజులైనా పట్టొచ్చునని అనుకునే పనివాళ్ళు, నాపద్ధతి ప్రకారం రోజుకెంతేనా పని చేయాలని అనుకుంటారు. తేడా ఎక్కడుందంటావు?" అన్నాడు.

రమణయ్యకు లోపం ఎక్కడుందో అర్థమైంది. ఆయన కూడా తన పద్ధతిని భూషయ్యలాగే మార్చి, చెరువు తవ్వకం పని త్వరగా పూర్తయేలా చేశాడు.



# కేరళ జానపద కథ

ఎటుతిరిగినా పచ్చటి కొండలూ కోనలతో, తటాకాలూ జలాశయాలతో, కొబ్బరి తోటలతో కనులపండుగ చేసే అద్భుత ప్రకృతి సౌందర్యానికి నిలయమైన కేరళరాష్ట్రాన్ని 'దేవుడి సొంతదేశం'గా అభివర్ణిస్తారు.

మలయాళంలో 'కేర' అంటే కొబ్బరి అని అర్థం. 'కేర' నుంచే 'కేరళ' అనేమాట వచ్చింది. మనదేశంలోని చాలా చిన్న రాష్ట్రాలలో కేరళ ఒకటి. దీని వైశాల్యం కేవలం 38,855 చ.కి.మీ. మాత్రమే. ఇది మన దేశ విస్తీర్ణంలో ఇంచుమించు ఒక శాతం ఉంటుంది. రాష్ట్రజనాభా 3,18,38,619.

మనదేశంలో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ జరిగినప్పుడు, 1956 లో అంతవరకు సంస్థానాలుగా ఉన్న తిరువాన్కూరు, కొచ్చిన్‌లు, అప్పటి మద్రాసు ప్రెసిడెన్సీలో భాగంగా ఉన్న మలబారు ఈ మూడు భాగాలను కలపడంతో సమైక్య కేరళ ఆవిర్భవించింది.

ఈ రాష్ట్రం అరేబియా సముద్రం, పడమటి కనుమల మధ్య 483 కి.మీ. పొడవు విస్తరించి ఉన్నది. ఉత్తర దిశలో కర్నాటక, తూర్పు దిశలో తమిళనాడు, పశ్చిమంగా అరేబియా సముద్రం, సరిహద్దులుగా కలిగి ఉన్నది. చాలా సంవత్సరాల క్రితమే నూటికి నూరుశాతం అక్షరాస్యతను సాధించిన రాష్ట్రం అన్న ప్రత్యేకత కేరళ సంతరించుకున్నది.

## కొచ్చుణ్ణి విశ్వాసం!

రెండువందల సంవత్సరాలకు పూర్వం కేరళ ప్రాంతంలోని కాయాంకుళం అనే గ్రామంలో కొచ్చుణ్ణి పుట్టాడు. అందువల్ల అందరూ వాణ్ణి కాయాంకుళం కొచ్చుణ్ణి అనే పిలిచేవారు. కాయాంకుళం ఒకప్పటి తిరువాన్కూరు సంస్థానానికి చెందినది. కొచ్చుణ్ణి పరమదయాళువు. దయాగుణంలో వాడికి సాటిరాగలవాళ్ళు కాయాంకుళంలోనే కాదు; ఆ చుట్టుపక్కల గ్రామాలలో కూడా లేరని చెప్పుకునేవారు.

కొచ్చుణ్ణి తల్లిదండ్రులు నిరుపేదలు. కొచ్చుణ్ణి మసీదుకు వెళ్ళడం, ఐదుసార్లు



నమాజుచేయడం ఒక్కరోజు కూడా తప్పేవాడు కాదు. ఒక్కొక్కసారి మసీదు నుంచి సంకేత శబ్దం కోసం ఎదురు చూడకుండా, అతడు ఎక్కడున్నాసరే మోకాళ్ళమీదికి వంగి, నేల మీద తువ్వాలు పరచి, పడమరకేసి తిరిగి దాని మీద కూర్చుని ప్రార్థనలు చేసేవాడు.

బహుశా చిన్నప్పటినుంచి కటిక దరిద్రాన్ని అనుభవించడంవల్లనో ఏమోగాని, అతనికి లోభులన్నా, వడ్డీలకు డబ్బులు ఇచ్చేవాళ్ళన్నా, ధనికులన్నా అంతగా గిట్టేదికాదు. అయితే, ఒక ధనికవ్యాపారి తన స్నేహితుడి కోరిక ప్రకారం కొచ్చుణ్ణికి తన దుకాణంలో ఉద్యోగం ఇచ్చాడు. కొచ్చుణ్ణి దుకాణంలో శ్రద్ధగా పనిచేసి యజమానికి విశ్వాసపాత్రుడయ్యాడు. సరుకులు కొనడానికి వచ్చేవారిపట్ల ఎలా గౌరవంగా నడుచుకోవాలో, వ్యాపారంలో నిజాయితీగా ఎలా ఉండాలో యజమాని అతనికి నేర్పాడు.

## పరశురామ క్షేత్రం

మహావిష్ణువు అవతారాలలో ఒకడైన పరశురాముడు మదాంధులైన ఇరవై ఒక్క మంది క్షత్రియులను నిర్మూలించిన తరవాత ప్రశాంతంగా తపస్సు చేసుకోవడానికి స్థలం కోసం దేవతలను ప్రార్థించాడు. దేవతలు ఆయన్నే సృష్టించుకోమన్నారు. పరశురాముడు గోకర్ణ పర్వత శిఖరంపై నిలబడి తన చేతిలోని పరశువును సముద్రంలోకి విసిరాడు. పరశువు పడినచోట జలం ఇంకిపోయి, భూప్రదేశం బయట పడిందట. అదే ఈనాటి కేరళ ప్రాంతం అనే కథ ఒకటి ఉంది. అందుకే దీనిని పరశురామ క్షేత్రం అని కూడా అంటారు.

ప్రతిరోజూ తెల్లవారగానే, కొచ్చుణ్ణి యజమాని ఇంటినుంచి తాళం చెవులు తీసుకు వెళ్ళి, దుకాణం తెరిచి, యజమాని రాక కోసం ఎదురుచూసేవాడు. సాయంకాలం యజమాని ఇంటికివెళ్ళాక, కొచ్చుణ్ణి దుకాణాన్ని శుభ్రంగా



ఊడ్చి, తలుపులు మూసి తాళం వేసి, తాళం చెవులను తీసుకువెళ్ళి యజమానికి అప్పగించేవాడు. అప్పుడు యజమాని భార్య ఇచ్చే అన్నాన్ని ఇంటికి తీసుకుపోయి, తన తల్లికింత పెట్టి, తను కొంత తిని నిద్రపోయేవాడు.

ఒకరోజు సాయంకాలం కొచ్చుణ్ణి తన యజమానికి తాళం చెవులుఅప్పగించి ఇంటికి బయలుదేరుతూన్న సమయంలో, ఒక పెద్ద మనిషి హడావుడిగా వచ్చి, "అప్పుడే కొట్టు కట్టేశారా?" అని అడిగాడు ఆత్రంగా.

"అవును, ఏమైనా కావాలా?" అని అడిగాడు యజమాని.

## జానపద నృత్యాలు

కేరళ రకరకాల జానపద నృత్యాలకు పుట్టినిల్లు. ఇవి కొన్ని శతాబ్దాలుగా రూపు సంతరించుకున్నాయి. వీటిలో 'కూత్తు' అనే ఏకపాత్రాభినయం చాలా ప్రసిద్ధ మైనది. ఇందులో 'చక్యార్' అనే కళాకారుడు వివిధ పాత్రలను అభినయిస్తాడు. మామూలుగా కూత్తును ప్రత్యేకంగా ఏర్పాటుచేసే 'కూత్తంబలం' అనే వేదిక మీద ప్రదర్శిస్తారు. 'కూడియాట్టం' అన్నది అతి ప్రాచీనమైన కేరళ ప్రాంత నాటకం.



అన్నిటికన్నా ప్రాచుర్యం పొందిన నాట్య నాటక ప్రక్రియ 'కథకళి' - ఆకర్షణీయమైన రంగురంగుల దుస్తులు, విచిత్రవేషధారణ, అలంకరణ, తలకు పెట్టుకునే తొడుగు, భుజకీర్తులు కథకళి ప్రత్యేక అంశాలు. కథాంశాలను పురాణాల నుంచి స్వీకరిస్తారు. మోహిని ఆట్టం, తుళ్ళల్, కైకొట్టిక్కళి మొదలైనవి కేరళలో ప్రాచుర్యంలో వున్న నాట్యరీతులు.



"అవును, నాకిప్పుడు బెల్లం కావాలి. రేపే మా చిన్నవాడి పుట్టినరోజు. వేకువజామున గుళ్ళో నైవేద్యం కోసం ఏర్పాటుచేయాలి. నేనిప్పుడు ఇంటికి వెళితే, పాయసం చేయడానికి పూజారికి ఇవ్వడానికి కొద్దిగా కూడా బెల్లం లేదని నా భార్య చెప్పింది. ఈ సమయంలో మరెక్కడా బెల్లం దొరకదు. మీరే సాయం చేయాలి," అన్నాడు పెద్దమనిషి ప్రాధేయ పడుతున్నట్టు.

"అలాగా, చెబుతాను ఉండండి," అంటూ కొట్టు యజమాని కొచ్చుణ్ణి కోసం చూశాడు. వాడు అప్పటికే వాకిలి దాటి వెళుతున్నాడు. "కొచ్చుణ్ణి, కొచ్చుణ్ణి, ఇలా రా. ఈయన మన కొట్లో సరుకులు కొనే పెద్దమనిషి. ఈయన్ను నీ వెంట కొట్టుకు తీసుకువెళ్ళు. ఇప్పుడే బెల్లం కావాలట ఇచ్చిరా," అన్నాడు యజమాని.

"అలాగే, బాబూ," అని కొచ్చుణ్ణి వచ్చిన వ్యక్తికేసి తిరిగి, "రండి, బాబయ్యా! నా వెంట

## హస్తకళలు

హస్తకళా నైపుణ్యానికి కేరళ ప్రజలు సుప్రసిద్ధులు. కేరళలోని శిల్పకళాకారుల కుటుంబాల వారు తమను దేవశిల్పి విశ్వకర్మ వంశానికి చెందిన వారుగా చెప్పుకుంటారు. శిలల మీద, లోహాల మీద శిల్పాలు చెక్కడంకన్నా కొయ్యశిల్పాలు చెక్కడంలో వీళ్ళు సిద్ధహస్తులు. అతి సున్నితమైన పనులతో అబ్బురపరచే కొయ్యశిల్పాలు దేవాలయాలలోనూ భవనాలలోనూ చాలా ఉన్నాయి. పేము పనులు, దంతం శిల్పాలకు కూడా రాష్ట్రం ప్రసిద్ధిగాంచింది. అయినా ఈనాడు దంతాలను ఉపయోగించడానికి నిషేధాలున్నాయి. కొబ్బరి చిప్పల మీద బొమ్మలు చెక్కడం కేరళ ప్రత్యేకత.

కంచు పనులకు కూడా కేరళను చెప్పుకోవాలి. దేవుళ్ళ బొమ్మలను కంచుతో అందంగా చేస్తారు. దీపాలు తయారుచేయడంలో కూడా కేరళకు ప్రత్యేక స్థానం ఉంది. రకరకాల పరిమాణాలతో, ఆకారాలతో తయారుచేస్తారు. మరొక సంప్రదాయకళ లోహాలతో అద్దాలు చేయడం. వీటిని దాదాపు నాలుగు వందల సంవత్సరాల నుంచి తయారుచేస్తున్నారు. రాగి మిశ్రమంతో అండాకారంలో ఈ అద్దాలను తయారు చేస్తారు. కొబ్బరి పీచుతో తయారుచేసే వస్తువులకు కూడా కేరళ ప్రసిద్ధిగాంచింది. నార చాపలు, కార్పెట్లు ఈ రాష్ట్రానికి ప్రత్యేకమైనవి.

రండి,'' అంటూ ముందుకు దారితీశాడు.

ఇద్దరూ వేగంగా నడిచి కొంతసేపటికి కొట్టును సమీపించారు. కొట్టు తలుపుకు వేలాడుతూన్న తాళాన్ని చూడగానే కొచ్చుణ్ణికి తను తాళం చెవులు తీసుకురాలేదన్న సంగతి జ్ఞాపకం వచ్చింది. యజమాని భార్య చేతికి తాళంచెవి అందించి, ఆమె ఇచ్చిన అన్నం మూటను తీసుకున్నాడు. యజమాని ఈ పని పురమాయించగానే అన్నం మూటను తర వాతవచ్చి తీసుకుందామని ఇంటిఅరుగుమీద పెట్టాడేతప్ప, తాళంచెవిని అడిగి తీసుకోలేదు.

''క్షమించండి బాబయ్యా! తాళం చెవులు





తీసుకురావడం మరిచిపోయాను,'' అన్నాడు బాధ,అపరాధభావం నిండిన కంఠస్వరంతో.

''తాళం చెవులు లేకుండా కొట్టునెలా తెరుద్దామనుకున్నావు? నువ్వొక మందమతివి. నాకు తెలుసు,''అంటూ పెద్దమనిషి మండిపడి, ''నాకిప్పుడు బెల్లం కావాలి. నువ్వేం చేస్తావో నాకు తెలియదు,'' అన్నాడు.

''బాబయ్యా, నీకిప్పుడు బెల్లం ఇవ్వకపోతే నేను చిక్కుల్లో పడతాను. యజమాని నన్ను బెల్లంపాకంలో మరిగించగలడు. కొంచెం శాంతించండి. ఏదైనా మార్గం ఆలోచిస్తాను,'' అంటూ కొచ్చుణ్ణితీవ్రంగా ఆలోచించసాగాడు. కొట్టును పరిశీలనగా చూశాడు. ఉన్నట్టుండి వాడి బుర్రలో ఒక ఆలోచన తళుక్కున మెరిసింది. ఇటీవల తాను వ్యాయామశాలలో నేర్చుకున్న విన్యాసం సమయానికి గుర్తుకు వచ్చింది. వరుసగా ఉన్న కొట్లలో ఎత్తు కాస్త తక్కువగా ఉన్న పెంకుల కప్పు మీదికి ఒక్క గెంతుతో ఎగబ్రాకాడు. మెల్లగా తమ కొట్టు వెనకభాగానికి చేరుకుని కిందికి దూకాడు. కొట్టు వెనకవైపు తలుపును అటూ ఇటూ కదిపి తెరిచేశాడు. లోపలికి వెళ్ళి రెండు ముద్దల బెల్లాన్ని మూట కట్టుకుని, వచ్చిన దారి గుండానే వెలుపలికి వచ్చేశాడు.

బెల్లం కోసం వచ్చిన పెద్దమనిషి పరమానందం చెందాడు. బెల్లం మూటను అందుకుంటూ, ''నువ్వింత సమర్థుడివని తెలియదు. సరే, మీ యజమానికి నా కృతజ్ఞతలు చెప్పు,'' అంటూ డబ్బిచ్చి తన దారిన వెళ్ళిపోయాడు.

తన యజమాని చెప్పిన పని పూర్తి చేసినందుకు కొచ్చుణ్ణి మనసులో చాలా మురిసిపోయాడు. తన యజమాని కూడా సంతోషించి మెచ్చుకుంటాడనుకున్నాడు.

వాడు ఇల్లు చేరేసరికి యజమాని అసహనంగా ఎదురు చూస్తున్నాడు. వాణ్ణి చూడగానే, ''తాళంచెవి తీసుకోకుండానే వెళ్ళిపోయావా మందమతి వెధవా? ఎక్కడా పెద్దమనిషి?'' అని కోపంగా అడిగాడు.

''బెల్లం తీసుకుని వెళ్ళిపోయాడు,'' అంటూ నవ్వడానికి ప్రయత్నిస్తూ, ''నేను ఆయనకు రెండు ముద్దల బెల్లం ఇచ్చాను. దానికి తగ్గ డబ్బుకూడా ఇచ్చేశాడు. ఇవిగో డబ్బులు,'' అంటూ నాణాలను యజమాని చేతికిచ్చాడు.

యజమాని శాంతించలేదు. ''తాళం చెవుల్లేకుండా కొట్టునెలా తెరిచావు?'' అని అడిగాడు.

''కొట్టును తెరవలేదు, బాబూ!'' అంటూ కొచ్చుణ్ణి తను చేసిన పనిని పూసగుచ్చినట్టు వివరించాడు.

''నీది చాలా చురుకైన బుర్ర! సరే ఇంటికి వెళ్ళు,'' అన్నాడు యజమాని.

కొచ్చుణ్ణిఅరుగుమీదున్న అన్నంమూటను తీసుకుని ఇంటిదారి పట్టాడు.

మరునాడు ఉదయం కొచ్చుణ్ణి తాళం చెవుల కోసం యజమాని ఇంటికివెళితే యజమాని లేడు. ఆసరికే కొట్టుదగ్గరికి వెళ్ళినట్టు తెలిసింది. ఉరుకులతో పరుగులతో కొట్టును చేరుకున్నాడు. యజమాని కోపంగా కనిపించాడు. ''కొచ్చుణ్ణీ, రాత్రి జరిగిన విషయం గురించి బాగా ఆలోచించాను. రాత్రిచేసినపనే, నీకు అవసరమైతే మునుముందు మరెప్పుడైనా చేయవని ఎలా అనుకోను? నీ మీద నమ్మకం నశించింది. నిన్ను పనినుంచి ఇప్పుడే తీసేస్తున్నాను. మరెక్కడైనా మరే పనైనా చూసుకో, ఇదిగో నీకు చేరవలసిన కూలి డబ్బులు,'' అంటూ డబ్బిచ్చాడు.

కొచ్చుణ్ణి అవాక్కయిపోయాడు. యజమాని చెప్పిన పనిని తానెంతో విశ్వాసంతో చేసినప్పటికీ తెల్లవారేసరికల్లా ఆయన మనసు మార్చుకున్నాడు. క్షమాపణ చెప్పుకోవాలని కూడా వాడికి అనిపించలేదు. యజమాని ఇచ్చిన డబ్బును పుచ్చుకుని, ఒక్క మాటైనా మాట్లాడకుండా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. ఈ సంఘటన వాడికి ధనికులపట్ల ఉన్న నిరసనభావాన్ని మరింత పెంచింది.



## పర్యాటకస్థలాలు

కేరళను పర్యాటకుల స్వర్గంగా చెప్పవచ్చు. రాష్ట్రమంతా ప్రకృతి సౌందర్యంతో కన్నుల విందు చేస్తుంది. ఇక్కడ చాలా వన్యమృగ అభయారణ్యాలు ఉన్నాయి. ఇడుక్కి జిల్లాలోని తేక్కడి పెరియార్ అభయారణ్యం ప్రధానమైనది. పెరియార్ నది మీద కట్టిన ఆనకట్ట ఫలితంగా ఏర్పడిన పెరియార్ రిజర్వాయర్ చుట్టూ ఇది ఉన్నది. 'ప్రాజెక్ట్ టైగర్' పథకం కింద 1978 లో దీనిని టైగర్ సంరక్షణాలయం(రిజర్వ్)గా ప్రకటించారు. ఇక్కడ ఏనుగులు, బైసన్లు, లేళ్ళు, పులులు, ఎగిరే ఉడతలు, ముంగిసలు అంటూ.. రకరకాల జంతువులు వున్నాయి. సరస్సులో దిగి ఒకదానిపై ఒకటి నీళ్ళు చిమ్ముకుంటూ ఆడుకుంటూ స్నానం చేసే ఏనుగుల గుంపులను చూడడం కన్నుల విందు చేస్తుంది.

మున్నార్ వేసవి విడిది, కొబ్బరిచెట్లతో నిండిన కొచ్చిన్ సరస్సులు, అద్భుతమైన అత్తిరంపల్లి జలపాతం, తిరువనంతపురం సమీపంలోని కోవలం సముద్రతీరం మొదలైనవి పర్యాటకులను విశేషంగా ఆకర్షిస్తాయి.

## గుజరాత్‌లో అశ్వమేధయాగం!



రామాయణ మహాభారతాలలో శ్రీరాముడు, ధర్మ రాజు చేసిన అశ్వమేధ యాగాల గురించి చదువు కున్నాం. 2001 వ సంవత్సరంలో భయంకరమైన భూకంపానికి గురైన గుజరాత్‌లో ఇప్పుడు ఆధునిక అశ్వమేధయాగం చేయడానికి తలపెట్టారు. యాగ విధులను తు.చ. తప్పకుండా శాస్త్రోక్తంగా నిర్వ ర్తించగలమని నిర్వాహకులు చెబుతున్నారు. ఉత్తర కేరళ కన్ననగాడ్‌లో తయారుచేసిన కొయ్య యాగా శ్వాన్ని తెప్పించారు. 6 అడుగుల ఎత్తూ, 7 అడుగుల పొడవూ గల ఈ గుర్రం బొమ్మను తమిళనాడు కళ్ళ క్కురిచ్చికి చెందిన స్వామిదురై, ఒకే మామిడిచెట్టు నుంచి చెక్కాడు. దానిని చెక్కడానికి అతనికి ఒక నెల పట్టింది. ఆ తరవాత దానిని అలంకరించడానికి మరో పక్షం రోజులు పట్టింది. గుర్రానికి ఇత్తడి కవచం తొడిగాక దానిని ప్రజలు దర్శించడానికి వీలుగా వాహనం మీద పదిహేను రోజుల పాటు తిప్పారు. అశ్వం వెనక వెళ్ళిన పండితులు ఆ పదిహేను రోజుల పాటు మంత్రాలను పఠించారు.

## నిశ్శబ్ద దినం



ఏప్రిల్ 13 వ తేదీ మనదేశం పలు ప్రాంతాలలో ఆయా ప్రాంతాల నూతన సంవత్సరారంభ వేడుకలు జరుపు కున్నారు. అయితే, ఆ రోజు ఇండోనేసియా బాలీ ద్వీపంలో నిశ్శబ్ద దినం పాటించారు. అక్కడ హిందువులే అధిక సంఖ్యలో నివసిస్తున్నారు. ఆ రోజంతా పనిపాటలు మానుకుని, ప్రయాణాలు చేయకుండా ఇళ్ళలోపలే ఉండిపోయారు. శబ్దం పుట్టించే ఎలక్ట్రానిక్ పరికరాలను ఉపయోగించలేదు. టీవీ, రేడియో, సినిమా ఏవీ లేవు. టెలిఫోన్లు సైతం పనిచేయలేదు. పర్యాటకులు హోటల్ గదుల నుంచి బయటకు రాలేదు. ద్వీపం మీదుగా విమానాలు వెళ్ళలేదు. ఓడలు ఆగిపోయాయి. ఇదంతా ఎందుకనుకున్నారు? అంతకు ముందురాత్రి సముద్రం నుంచి వెడలగొట్టబడిన దుష్టశక్తులు తిరిగి మరునాడు ద్వీపంలోకి అడుగుపెట్టకుండా అడ్డుకోవడానికి! ఆరోజు జాతీయ సెలవుదినం కూడా!



# విఘ్నేశ్వరుడు

కుపూ రస్వావి కి తన పేళ్ళి ఆగిపావడానికి కారణవైన విఘ్నేశ్వరుడి వీద చాలా గ్రుగ్రుగా ఉంది.

ఒకనాడు అతడు తల్లితో, ''వాజవ్మకాక జేజెవ్మ ఎలాగౌతాడవ్మా అన్న! నలు గ్రువ్ము ద్ద తిండివ్ము ద్దకే గాని ఘనకార్యం చేయు గలడా?'' అన్నాడు విఘ్నేశ్వరుడికేసీ చేయ్యి చూపుతూ ఎకసక్కెంగా.

వినాయ్రుకుడు గ్రుడ్ల నీరు పేట్చుకొని, ''చూడవ్మా! తవ్మ్ముడు నన్ను ఎంతలేసీ వూటలంటున్నాడో...'' అంటూ ఏడ్చిసుంత పినిచేశాడు.

కువూరస్వావి వూటలకు పార్వతికి కూడా కోపం వచ్చింది. వినాయ్రుకుణ్ణి అక్కున చేర్చుకొని బుజ్జగిస్తూ, ''నాన్నా, నేను చేసీన బొవ్మవని వాళ్ళకు అక్కసు రా! తండ్రి చంపినే చరుబశాడు, తవ్మ్ముడు ఇలాగదెప్పితున్నాడు. పానీలే, వాళ్ళ అజ్ఞాను వాళ్ళకే తలవంపిషా'' అంది.

''తవ్మ్ముడు అజ్ఞాని అయ్యితే అవతాడు గాని, నాన్నకు అజ్ఞానం ఏవిటవ్మా, నీ పిచ్చిగాని...'' అన్నాడు గణపితి ఎంతో ఆశ్చర్యంగా.

పార్వతి ఏదో తలంచుకొని, ''నాకు కాదు రా పిచ్చి, ఆ శంకరవుహాదేవుడికే పిచ్చిఎక్కి విష్ణుదేవుడి జగన్మోహిని అవతారం వెంటబడి నవ్వులపాలవలేదా ఏవిటి!'' అన్నది.

''ఆ తర్వాతేం జరిగిందవ్మా?'' అన్నాడు గణపితి.

'' ఏదో ఘోరవే జరిగింది, వాళ్ళిద్దరి వుధ్యా ఒక భైరవుడనే కారు చీకటిలాంటి భూతపిల్లడు పుట్టాడట!'' అంది తల్లి.



"భైరవుడెక్కడుంటాడమ్మా? వాణ్ణి చూ డాలని మాది!" అన్నాడు కొడు కు.

"ఎక్కడో ఉంటాడ్రు. నల్లటిబట్టలు కడతాడట, వాడిదగ్గిరికి పొరబాటున కూడా వెళ్ళకు పి వీ , చూస్తె ఝుఢ్రు పి కుంటామ్" అంది పార్వతి.

"ఝుఢ్రు పి కోవడవు ంటేఏవి టవ్మూ? అది కూడా తెలు పి కోవద్దూ?" అన్నాడ్రు గణపితి వింతగా చూ స్తూ.

"పేళ్ళాడితే నీకే తెలు స్తుంది!" అంది పార్వతి.

"అదా సింగతి! భార్యారత్నాలు అంటే అంత భయు ంకరం అన్నవూ ట! అందు కే మొత్తుకుంటున్నాను. నేను పేళ్ళి చేసు కో నవ్మూ!" అన్నాడు గణేశు డు.

కువూ రస్వావి అందు కొని, "అదే నీ ఘనకార్యం! నేను ఇప్పిడే పొలు పొ ర్ర వ్యణ్ణి చుట్టి వస్తాను!" అంటూ నెమలినెక్కి తుర్రు వు న్నాడ్రు.

పెవ్ట్నశ్వరుడు తిన్నగా వెళ్ళి వే ర్ర పిర్వతం ఎక్కి చిట్టచివర శిఖరాగ్రం వీ ద కుదు ర్ర గా కూర్చున్నాడ్రు.

వే ర్ర పిర్వతం చు ట్నూరా సొ ర్ర్యడు తిర్ర గ త్తూ ంటాడు .అక్కడ పొ ర్యాస్తివు వు ం అనేది ఉండదు .

కువూ రస్వావి శ్రవు పిడి సొ ర్ర్యడి చు ట్నూరా ప్రిద° ణం చేసీ వచ్చి అన్న వే ర్ర పిర్వతం ఎక్కి కూర్చున్నాడని తెలు పి కొని, ఎంతో విచారంగా వు ఖం వేలవేసీ ఊర్ర కున్నాడు .

"ఏం కువూ రా, ఎందు కు అలా తలవేలా డదీసి కున్నావూ?" అని పార్వతి ఆశ్చర్యపొత్రా అడిగింది.

"అవ్మూ! నేను ఎంతో కష్టిపిడి పొ ర్ర్యడి చు ట్నూరా తిరి గితే, అన్న పి నాయ్మా సింగా పొ ర్ర్యణ్ణే తన చు ట్నూరా త్రిప్పికుంటు న్నాడమ్మా! నిజం చెప్పాలంటే అన్న చేసినదే ఘనకార్యం!" అన్నాడ్రు కువూ రస్వావి ఎంతో విచారంగా.

కొద్ది రోజుల తర్వాత పార్వతి వ ళ్ళీ పేళ్ళి ప్రిస్తావన తెచ్చింది.

"అవ్మూ! ఎ ందర్యంలో నీకు సివు ఉజ్జీ అల్లు న పి ందరి కనిపిస్తే పేళ్ళాడాలని ఉందవ్మూ!" అన్నాడ్రు పెవ్ట్నశ్వర్ర డు.

పార్వతి చు రక తగిలినట్లు పేదవి కర్ర చు కొని, "అలాగైతే ఇంటి వు గసాల కూర్చొని, దారివెంట వచ్చేపోయే వాళ్లను చూస్తూండరా, కుంకా!" అంటూ అక్కడి వు ంచి అవతలికి కదిలింది.

"అలాగే తల్లీ! నీ ఆజ్ఞ!" అని వినాయకుడు వీధిలో కూర్చుని కొంతసేపు తూర్పుకు మరికొంతసేపు ఉత్తరంకూ, అలాగ ఎనిమిది దిక్కులకూ ముఖం పెట్టి చూడసాగాడు అదేపనిగా. పార్వతి అతని వింత చేష్టకు వింతగా చూసీ, "ఏం నాయనా, కనిపించింది?" అని అడిగింది.

విఘ్నేశ్వరుడు, "అమ్మా! ఏదిక్కు చూసినా నాకు మరేదీ కనిపించలేదు. జగజ్జననివైన నీవే ఎనిమిది చేతులతో ఎనిమిది దిక్కులా కనిపిస్తున్నావమ్మా!" అన్నాడు.

పార్వతి ఆనందంతో పులకరించిపోయింది. "నాయనా! విఘ్నరాజా! అందరు దేవుళ్ళూ తూర్పు ముఖంగా ఉండి పూజలందుకోవాలని నియమం ఉండగాని, నీమాత్రం ఎటు ముఖం పెట్టి ఉన్నా ఆరాధనీయుడవే!" అని వరం ఇచ్చింది.

అతని పెళ్ళిమాటే మర్చిపోయాడు, ముద్దుల కొడుకు మరిపెం మాటలు శివుడితో ఒకటికి రెండుసార్లు చెప్పి చెప్పి ఆనందించింది.

చివరకు పార్వతి పట్టుబట్టి పెళ్ళి ప్రస్తావన తెచ్చింది.

"అమ్మా! తమ్ముడు దేవసేనాధిపతి పదవిలో ఉన్నాడు. అతను ఇద్దర్ని పెళ్ళాడినా తగును. నేను ఊరికే తింటూ కూర్చున్నాను. ఎలాపెళ్ళిచేసుకునేది?" అన్నాడు విఘ్నరాజు.

శివుడు, "నువ్వు నా ప్రమథగణాలన్నిటికీ గణనాయకుడివిగా ఉండు!" అన్నాడు.

"నాన్నగారూ! ఉండమంటే సరా? అర్హత ఉండాలి గదా! తమ్ముడు ఎలాగూ సేనాధిపత్యంలో ఆరితేరి ఉన్నవాడు, ఉండనే ఉన్నాడు గదా!" అన్నాడు విఘ్నేశ్వరుడు.

ప్రమథులు కుమారస్వామినే అభిమానించారు.



శివుడు, "లేదు, నా గణాలకు గణనాథు డుగా విఘ్నేశ్వరుడే ఉండాలి! కుమార స్వామికి దేవసేనాధిపత్యం ఉండనే ఉంది. అదీగాక, రెండు పిల్లలు చూసి కోపడం శ్రమ కూడా!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు, కొంతసేపు ఆలోచించి, "నాన్నగారూ, ఏదేనా పరీక్ష పెట్టి నెగ్గినవారికే గణనాయకత్వం ఇవ్వడం సమంజసంగా ఉంటుంది గదా!" అన్నాడు.

దేవతలు, ప్రమథులు కలిసి ఒక పందెం పెట్టారు. ఈ భూమ్మీదున్న అన్ని క్షేత్రాల్ని, తీర్థాల్ని ఎవరు ముందు సేవించి తిరిగి వస్తారో వారు గెల్చినట్టు అని.

కుమారస్వామి నెమలి మీద ఎగిరి వెళ్ళాడు.

వినాయకుడు లోలోపల సంతోషిస్తూ చక్కా చతికిలబడి కూర్చున్నాడు.

అప్పుడు విష్ణుమూర్తి అతణ్ణి ఏకాంతానికి తీసుకెళ్ళి, "నాయనా! మేము నిన్ను అభిమానిస్తున్నవాళ్ళం. నీ ఓటమి మా దేవతలందరి ఓటమి అవుతుంది. మా కు తలవంపులు తేవడం నీకు భావ్యం కాదు. అదీగాక తండ్రి గొప్పదనం తనయుడు నిరూపించితేనే జన్మసార్థకత అవుతుంది. నువ్వేమీ తిరగనక్కరలేదు. నేను చెప్పినట్టు చేస్తే చాలు!" అని విఘ్నేశ్వరుడి చెవిలో రహస్యం ఉపదేశించాడు.

పార్వతి 'హమ్మయ్య' అనుకుంటూ విష్ణుమూర్తి కేసి కృతజ్ఞతగా చూసింది.

విఘ్నేశ్వరుడు తపస్సు చేసి కన్నులు మూసి శివపంచాక్షరీ మంత్రాన్ని భక్తితో జపిస్తూ కూర్చున్నాడు.

కుమారస్వామి వెళ్ళినచోటల్లా అంతకంటే ముందే విఘ్నేశ్వరుడు ఎలుక మీద వచ్చి తీర్థమాడి సేవించి వెళ్ళినట్లు తెలుసుకుని ఆశ్చర్యపడుతూ హతాశుడై తిరిగి వస్తూనే తాను ఓడిపోయినట్లూ, విఘ్నేశ్వరుడిదే విజయమనీ చెప్పాడు.

విఘ్నేశ్వరుడు తమ్ముడితో చేతులు కలిపి శివుడి వద్దకు తీసుకెళ్ళి, "తమ్ముడూ! నేను జయించనూ లేదు. నీమా ఓడనూ లేదు. మనం ఇద్దరం నిమిత్తమాత్రులం. జయించింది నాన్నగారే! శివపంచాక్షరీ మహిమ అలాంటిది. గెలిచినది శివనామం, గెలిపించింది విష్ణుమాయ" అని జరిగింది చెప్పాడు.

విఘ్నేశ్వరుడూ, కుమారస్వామీ చెరో పాదమూ పట్టుకొని తండ్రికి భక్తితో మొక్కారు.

కుమారస్వామి అందరి మధ్య నిలబడి, "విఘ్నేశ్వరుడికి ప్రమథగణాధిపత్య పట్టాభి



౼షకం సిత్వరవ్రే జరగాలి. శివుడి ఆజ్ఞ అందరికీ శిరోధార్యము!'' అని నొక్కి చెప్పాడు.

దేవతలు సింతోషించార్రు. సీద్ధ, సాధ్య, య్రు ౕ, భూ తగణాలవారంతా హిర్షం ప్రికటించార్రు. ప్రివ్రు థగణ ప్రివ్రు ఖ్రు ల్యైన భ ంగీశ్వర, శ ంగీశ్వర, చండీశ్వర, నందీశ్వర్రు లు వ్రూ త్రం వ్యతిరేకించార్రు. లోగడ షిుత్రగణపితి ర్రూ పింతో వాళ్ళన్ర్ర విఘ్నేశ్వర్ర డ్రు శ ంగభంగం చేశాడ్రు.

ఆ అక్కస్రి తో వార్ర, ''కువ్రూ రస్వావ్రి కి తన బలాల్రు అంటూ దేవగణాసుల్రు ఉన్నార్రు. వేవ్రు శివుడి నవ్ర్మిన బంట్ను గా శివగణంగా మొదటన్ర ంచీ పిరిగణింపిబడ్ర్త తు న్నాం. అటు వంటప్ప్రుడ్ర విఘ్నేశ్వర్ర డ్రు వ్రూ కు అధిపితి ఎలాగ అమౌతాడ్రు? గణపితి అనిపీంచు కోడానికి కూడా అతనికి తనది అంటూ ఎలాంటి బలగవ్రూ లేద్రు. గణాధిపిత్యవిట్టాభిషకం దేనికి?'' అని కుళ్ళు వెళ్ళబోసుకున్నారు.

శివుడ్ర కళ్ళ్రురజేశాడ్ర. ''నా నిర్ణయ్రూ న్నే అధిక్షేపించగలంత గొప్పవారెవ్యా య్రూ రా వీ ర్ర!'' అని ప్రివ్ర థనాయ్ర కుల్ని ఈసిడించ్రు కున్నాడ్ర.

విఘ్నేశ్వర్ర డ్రు శాంతంగా, ''ఔన్ర, ఔన్ర, నిజవే నా గణాల్రు ఎక్కడ? లేమూకాబోల్రు! అన్నట్టు షిుత్రగణపితిగా ఉన్నప్ప్రుడ్ర నాకూ కొంత బలగం ఉన్నట్లు అన్ర వ్రూ సం, ఆ గణాల్రు ఎక్కడ? ఎక్కడ?'' అని అరిచాడ్రు.

అప్ప్రుడ్ర కొటాన్ర కోట్ల విఘ్నేశ్వర్రు డి లాంటి వార్ర దిక్కుల్రు ఈనినట్లు పిుట్టుకొచ్చి దిక్కుల్రు పీక్కటిల్లేలాగ జయ్రు జయ్ర ధ్వానాల్రు చేస్తూ విఘ్నేశ్వర్రు డి బలాల్రు గా వచ్చి నిల్చున్నార్ర.

వారందరికీ తలా నాల్ర గ్ర చేత్ర ల్రు న్నార్రు. నాల్ర గ్ర చేత్ర ల్లో అనేక ఆయ్రు ధాల్రు, పిరికరాల్రు, చిత్రవిచిత్ర వస్త్రు జాలవ్రూ ఉన్నార్రు. కొందరి చేత్ర ల్లో గంటాల్రు, లేఖిన్ర ల్రు,

కుంచెలు, రంగులు ఉంటే మరికొందరి చేతుల్లో శూలాలు, విల్లమ్ములు, కత్తులు, గదలు ఉన్నాయి. కొందరు కొడవళ్ళు, సుత్తులు, కత్తులు, రంపాలు, ఉలులు, శేనాలు పట్టుకొని ఉన్నారు. మరికొందరు వీణలు, మృదంగాలు, వేణువులు, డప్పులు వాయిస్తున్నారు. మాలికలు, ఔషధాలు, పానీయాలు, నాగళ్ళు, రాట్నాలు, నవరత్నాభరణాలు, పైలమాలలు, పింఛాలు, తిన్న బండారాలు మొదలైనవెన్నో పట్టుకొని ఉన్నారు. వారిమధ్య దేవమూర్తుల్లా దేవతల్లా ప్రమథాది గణాలవాళ్ళు బియ్యంరాశిలో రాళ్ళలా అక్కడక్కడ కనిపించారు.

విఘ్నేశ్వర రూపులు కొందరు ఆకాశంలో ఎగురుతూ అంతరిక్షానికి దూసుకుపోతున్నారు. ఆ గణాధిపిగణాల చేతుల్లో ఛత్రచామరాలు, వీవనలు, వింజామరాలు ఆడుతున్నవి. ఆకాశంలో రెపరెపలాడుతున్న అరుణారుణ పతాకాల్ని, ఇంకా అనేక రంగురంగుల ధ్వజాల్ని పట్టుకొని ఉన్నారు. వారు రత్నభూషితమైన పెద్ద భద్రసింహాసనాన్ని తెచ్చారు. విఘ్నేశ్వరుణ్ణి దానిపైకూర్చుండబెట్టి ఛత్రచామరాలు పట్టారు. శ్వేతఛత్రం ముత్యాల జాలరులతో ప్రకాశించింది. చిట్టెలుక సింహాసనం కింద ఆనందంతో చిందులు వేసింది.

పార్వతి మరొకసారి మళ్ళీ మైమరిచి భద్రసింహాసనాసీనుడైన విఘ్నేశ్వరుడికి నమస్కరించబోయింది.

"అమ్మా! అమ్మా! వద్దు, నీ ముద్దుల కుమారుణ్ణి," అని విఘ్నేశ్వరుడు వారిస్తూ చేతులూపేసరికి అంతా అదృశ్యమై, విఘ్నేశ్వరుడు ఒక్కడూ వినయంగా తల్లికి ప్రణమిల్లాడు.

"విఘ్నేశ్వరా!" అన్న పిలుపు శంఖధ్వనిలా వినిపించింది. ఆ పిలిచింది విష్ణువని విఘ్నేశ్వరుడు అటు చూడకుండానే, "నువ్వు చెప్పబోయేది నాకు తెలుసు!" అన్నాడు.

"నీకు తెలిసినా, అది అందరికీ కూడా తెలియాలి కదా, అదే చెబుతున్నాను!" అంటూ విష్ణుమూర్తి "విఘ్నేశ్వరుడి పెళ్ళికి వెయ్యి విఘ్నాల సామెతగా విఘ్నేశ్వరుడు కల్పించుకున్న విఘ్నాలు ఇప్పటికి వెయ్యీ పూర్తయ్యాయి! ఇటు పైని విఘ్నం కల్పించుకోడానికి వీల్లేదు, కల్పించుకొన్నా చెల్లదు!" అని గట్టిగా పలికాడు.



# రామాపురం సంబంధం

రంగనాథం పెద్దబజారులో ఉన్న తన బట్టల కొట్టు కట్టేసి, ఇల్లు చేరేసరికి అతడి భార్య రాజేశ్వరి నవ్వుతూ ఎదురు వచ్చింది. ఆమె నాలుగు రోజుల క్రితం, తన అన్నయ్య మనుమడి బారసాలకని పుట్టింటికి వెళ్ళి, ఆ రోజు మధ్యాహ్నమే తిరిగి వచ్చింది.

భోజనాల దగ్గర రాజేశ్వరి, రంగనాథంతో, "మా అన్నయ్య మన అబ్బాయికి మంచి సంబంధం చెప్పాడు. లక్షకుపైగా కట్నం ఇస్తారట. కానీ పిల్ల నలుపట! అయితేనేం, అందం కొరుక్కు తింటామా!" అన్నది.

"అంటే, నలుపుగా ఉండేవాళ్ళందరూ అందచందాలు లేనివాళ్ళన్నమాట! మరి నీమాటేమిటి?" అంటూ రంగనాథం నవ్వి, రాజేశ్వరి ఏదో అనబోయేంతలో, "సరే, ముందు నే చెప్పేది విను! నిన్న రామాపురం నుంచి, రాజేశ్వరం అనే ఆయన వచ్చాడు. వాళ్ళమ్మాయిని పట్నంలో ఏదో పెళ్ళిలో చూసి, మన అబ్బాయి ఇష్టపడ్డాడట! పెళ్ళిచూపులకు రమ్మని పిలవడానికి వచ్చాడు," అన్నాడు.

ఆ మాటలకు రాజేశ్వరికి పొలమారింది. కొడుక్కు పట్నంలో నోపింలాంటి ఉద్యోగం. ముందే పిల్ల నచ్చిందంటే, కట్నం గుమ్మరించడానికి ఏ తండ్రి సిద్ధపడతాడు?

"మీరు వెళ్ళి ఆ పిల్లను చూడండి. వాళ్ళు కనీసం లక్ష రూపాయల కట్నం ఇవ్వడానికి సిద్ధపడితే, అప్పుడు నేను వెళ్ళి చూస్తాను!" అన్నది రాజేశ్వరి, కంచంలో చేయి కడిగేసుకుంటూ.

నాలుగు రోజుల తర్వాత, రామాపురం బయల్దేరి వెళ్ళాడు రంగనాథం. పిల్ల కుందనపు బొమ్మలా ఉంది. మంచి సంప్రదాయకమైన

మాచిరాజు కామేశ్వరరావు

కుటుంబం. అయితే, పిల్ల తండ్రి కట్నం ఇచ్చుకోలేడని తెలుసుకుని, "మాకు అధమం పదిలక్షలు కట్నం కావాలి. మాతో మీరు తూగలేరు. మరో సంబంధం చూసుకోండి!" అని ఖచ్చితంగా చెప్పేసి, తిరుగు ప్రయాణమయ్యారు రంగనాథం.

సమయానికి బాడుగ బండి ఏదీ దొరకక, అలా రహదారి చేరి ప్రయత్నిద్దామనుకుంటూ బయల్దేరారు, రంగనాథం. క్రమంగా చీకట్లు కమ్ముకుని, ఆగకుండా పెద్దపెట్టున వర్షం ఆరంభమైంది. ఆసరికి ఊరి పొలిమేర చేరిన రంగనాథం, దారిపక్కన కనిపించిన పాతకాలపు పెంకుటింటి తలుపు తట్టారు. కొద్దిసేపట్లో కిర్రుమని శబ్దం చేస్తూ, తలుపు తెరుచుకున్నది. గుమ్మంలో, చేతితో దీపం పట్టుకుని, బక్కపలచగా ఉన్న ముసలి మనిషి నిలబడి ఉన్నారు.

"వర్షం మరింత ఎక్కువయ్యేట్లా ఉన్నది. ఈ రాత్రికి మీ ఇంట్లో ఆశ్రయం ఇస్తారా?" అని, రంగనాథం వచ్చిన, ఆ ముసలి మనిషిని అడిగారు.

"ఆశ్రయం ఇవ్వగలను గానీ భోజనం పెట్టలేను. ఇది అసలే ఆడదిక్కులేని కొంప!" అన్నారు ముసలివారు, రంగనాథాన్ని లోపలికి తీసుకువెళుతూ.

ముసలివారు మధ్య గదిలో రెండు చాపలు పరుస్తూ, "నాపేరు భూషణం, మీపేరు? ఏం పనిమీద బయలుదేరారు?" అని అడిగారు.

రంగనాథం చాపమీద నడుం వాల్చి, "మాది సీతాపురం, నాపేరు రంగనాథం. రామాపురం వెళ్ళి వస్తున్నాను. పెద్దవారు, అనుభవజ్ఞులు, చెప్పబుద్ధవుతున్నది," అంటూ జరిగింది చెప్పి, "కట్నం ఇచ్చుకోలేను, ఆ అమ్మాయి





తండ్రికి మరో సంబంధం చూసుకోమని గట్టిగా చెప్పేశాను," అన్నాడు తలకింద దిండు సరి చేసుకుంటూ.

"మరి, మీ అబ్బాయికి పిల్ల నచ్చిందన్నారు!" అన్నాడు భూషణం, తనూ పక్కన కూర్చుంటూ.

"అయితేనేం? పిల్ల తండ్రి కట్నం ఇవ్వక పోవడం, నాకు నచ్చలేదు," అంటూ రంగనాథం పెద్దగా నవ్వాడు.

భూషణం కొద్దిసేపు తీక్షణంగా చూసి, "నేనీ వయసులో, ఇలా దిక్కులేని బతుకెందుకు బతుకుతున్నానో తెలుసా మీకు?" అని అడిగాడు రంగనాథాన్ని.

తెలియదన్నట్టు తల అడ్డంగా ఊపాడు రంగనాథం.

"నా కొడుకు పెళ్ళికి కట్నం తీసుకున్నందుకు!" అన్నాడు భూషణం.

"అదేమిటి?" అంటూ ఆశ్చర్యపోయాడు రంగనాథం.

"వినండి! జరిగినదేమిటో నాలుగు మాటల్లో చెబుతాను," అంటూ ప్రారంభించాడు భూషణం:

"కట్నం కోసం నేను గట్టిగా పట్టుబట్టడంతో, వాళ్ళ నాన్న తరతరాలుగా వస్తున్న ఇంటిని అమ్ముకుని నిలవ నీడలేనివాడయ్యాడని, మా కోడలు నా పట్ల కసిగా ప్రవర్తించడం ప్రారంభించింది. నా కొడుకు పెళ్ళాం చేతిలో కీలుబొమ్మ. అప్పటికే భార్య పోయిన నన్ను, శత్రువు కన్నా హీనంగా చూసేది. ఇక భరించలేక నేను, చాలా ఏళ్ళ క్రితం మా బంధువులదైన పాడుబడ్డ ఇంట్లో చేరాను. ఒంట్లో నలతగా ఉన్నా ఇంత ఉడకేసి పెట్టేవారు లేరు. పలకరించే దిక్కులేదు. ఒంటరి బతుకు!" అంటూ పైపంచతో ముఖం కప్పుకున్నాడు.

ఇది విన్న రంగనాథం నోట మాట పెగల లేదు. అర్ధరాత్రి దాటాక కాస్త నిద్ర పట్టింది. తర్వాత మెలకువ వచ్చేసరికి బారెడు పొద్దెక్కింది. పక్కన భూషణం లేడు.

రంగనాథం ఇంట్లోంచి బయటకు వచ్చాడు. ఎదురుగా ఒక ముసలమ్మ తుమ్మచెట్టు కాయలు కోసి మేకలకు వేస్తున్నది. ఆమె, రంగనాథం కేసి చూసి, "ఎవరు మీరు? రాత్రంతా, ఆ పాడుబడ్డ కొంపలో కాలం గడిపారా? ఏమన్న ధైర్యం!" అన్నది.

ఆమె మాటలు సరిగా అర్థంకాని రంగనాథం, "ఒకటే వర్షం. తప్పనిసరై ఈ ఇంట్లో తల దాచుకోవలసి వచ్చింది. ఇంతకీ, రాత్రి ఇంట్లో వున్న ముసలాయన ఎటు వెళ్ళినట్టు?" అన్నాడు.

ఆ మాటలు వింటూనే ముసలావిడ చేతిలోని కొంకి కర్ర కింద పడేసి, "ఔరా! కట్నాల పిచ్చిభూషణంగారు దయ్యమయ్యాడని ఊళ్ళోవాళ్ళు చెప్పుకునేది నిజమేనన్న మాట! కట్నం కోసం వేధించాడని కోడలు కక్ష కట్టి, ఇంట్లోంచి తరిమేసింది. తర్వాత భూషణంగారు దిక్కులేక, ఈ ఇంట్లోనే నాలుగు నెలలపాటు మంచాన పడి నరకయాతనలు అనుభవించి, ఏడాది క్రితమే పోయాడు!" అన్నది.

రంగనాథం తన చెవులను తానే నమ్మలేక పోయాడు. రాత్రంతా తానొక దయ్యంతో గడిపానన్న నిజం, ఆయన వెన్నులో వణుకు పుట్టించింది. అప్పటికప్పుడు ఒక నిశ్చయానికి వచ్చిన రంగనాథం, అటు కేసి వస్తున్న ఒక బాడుగ బండిని ఆపి లోపల కూర్చున్నాడు. బండి వెనుదిరిగింది.

ఆ తర్వాత కొద్దిసేపటికి భూషణం, ఇంటి ఆవరణలో వున్న చెట్ల చాటునుంచి బయటికి వచ్చి, ముసలావిణ్ణి సమీపించి, "అక్కయ్యా! నేను చెప్పినట్టు చెప్పి, ఈ రంగనాథంగార్ని నాలాంటి దురవస్థ పట్టకుండా పుణ్యం కట్టుకున్నావమ్మా" అన్నాడు.

"పుణ్యమా! ఆయనకు కట్నం పిచ్చి వదిలిందని, నీకెలాతెలుసు?" అని అడిగింది ముసలావిడ ఆశ్చర్యపోతూ.

"తెలియదులేదా! ఆయన బాడుగ బండిని వెనక్కుతిప్పించి,రామాపురంకేసివెళ్తున్నాడు," అన్నాడు భూషణం సంతోషంగా.





# జ్ఞాని, అజ్ఞాని, మూర్ఖుడు!

శివానందస్వామి అనే పండితుడు, తన గురుకులంలో శిష్యులకు శాస్త్రవిద్యలతోపాటు లౌకికజ్ఞానం కూడా అలవడేలా విద్యాబోధ చేస్తూండేవాడు. ఎన్ని శాస్త్రాలు క్షుణ్ణంగా అధ్యయనం చేసినా, జీవిత గమనంలో ఎదురయ్యే ఒడిదుడుకులను తట్టుకుని ప్రశాంత జీవనం సాగించాలంటే, అందుకు లౌకికజ్ఞానం ముఖ్యావసరం అని ఆయన దృఢవిశ్వాసం.

ఒకనాటి సూర్యోదయం వేళ అరణ్యంలో వైద్యానికి ఉపకరించే మూలికలు సేకరించడానికి ఆయన, ముగ్గురు శిష్యులతో బయల్దేరాడు. వాళ్ళల్లో ఇద్దరు ఆమధ్యనే గురుకులంలో చేరిన విద్యార్థులు.

శివానందస్వామి వెనకగా నడుస్తున్న శిష్యుల్లో, కొత్తగా చేరిన శిష్యుడొకడు ఆయనను, "స్వామీ! వారం రోజుల క్రితం నేనడిగినప్పుడు, జ్ఞాని, అజ్ఞాని, మూర్ఖుడి మధ్య వుండే భేదాన్ని తరవాత చెబుతామన్నారు," అన్నాడు.

దానికి శివానందస్వామి జవాబివ్వలేదు. కానీ, చాలాకాలంగా గురుకులంలో ఉంటున్న శిష్యుడు, ఆ ప్రశ్నించినవాణ్ణి కోప్పడుతున్నట్టుగా చిన్న గొంతుతో, "గురువుగారికి ఎప్పుడు ఏం చెప్పాలో తెలియదనుకుంటున్నావా? ఇక ఊరుకో!" అన్నాడు.

అందుకు కొత్తగా చేరిన శిష్యుల్లోని రెండవవాడు, "గురువుగారు మనకు అనేక విషయాల గురించి వివరంగా బోధిస్తూంటారు. ఆ కారణంగా, అప్పుడప్పుడూ మనం వెలువరించే సంశయాలకు ఆయన సంశయనివృత్తి చేయడం మరిచిపోయి వుండవచ్చు గదా!" అన్నాడు.

అసలు సంగతేమంటే–శివానంద స్వామి, అతి ముఖ్యమైన కొన్ని జీవిత సమస్యలను తన

ఆకెళ్ళ వెంకటసుబ్బలక్ష్మి



శిష్యులకు సాధ్యమైనంతవరకూ ప్రత్యక్ష ఉదాహరణలద్వారానే విపులంగా తెలియ జెపుతూంటాడు.

గురుశిష్యులుఅరణ్యంలోఅక్కడాఇక్కడా వెదికి కొన్ని వనమూలికలను సేకరించేసరికి మధ్యాహ్న సమయమయింది. కొంచెంసేపు విశ్రాంతి తీసుకుని, గురుకులానికి బయలు దేరుదామని చెట్టునీడలో కూర్చున్నారు.

ఆ సమయంలో అక్కడికి దాపులనున్న, ఒక చెట్టు దగ్గరకు ముగ్గురు బాటసారులు వచ్చారు. వాళ్ళ భుజాలనుంచి బరువైన పెద్ద సంచులు వేళ్ళాడుతున్నవి. ముగ్గురూ నడి వయసువాళ్ళు.

వాళ్ళు సంచులను నేలమీద పెట్టి చుట్టూ ఒకసారి కలయచూశారు. వాళ్ళల్లో ఒకడు పక్కనే వున్న ఒక చెట్టుకింది పెద్ద పుట్టను చూసి భయపడుతున్నవాడిలా ముఖంపెట్టి, "చూశావా, ఆ చెట్టుకింది పుట్టను? అది పాముల పుట్ట. మనం అలా కాస్త కునుకు పట్టి కళ్ళు మూశామో, ఏదో ఒక పాము వచ్చి కాటేసి తీరుతుంది. మనం నిద్రమాని కాపలా కూర్చోగలమా!" అన్నాడు.

దానికిమరొకబాటసారి, "మనంముగ్గురం ఇక్కడే విశ్రాంతి తీసుకుందాం. అంత పామంటూ వస్తే, సునాయాసంగా చంపే యొచ్చు!" అన్నాడు సంచీలోంచి దుప్పటి తీసి కిందపరుస్తూ.

అందుకు మొదటి బాటసారి, "ఊహు, ఎన్నయినా చెప్పండి, నేనిక్కడ పడుకోను. ముందుకు పోయి, కాస్త మంచి చోటు చూసుకుంటాను," అన్నాడు, అక్కడి నుంచి కదలబోతూ.

అప్పటి వరకూ మౌనంగా వున్న మూడో బాటసారి, "తొందరపడకు. అరణ్యంలో ఎక్కడా మంచి చోటూ, ప్రమాదం లేనిదీ అన్నదే వుండదు. ఉన్నంతలో తక్కువ ప్రమాదం అనుకున్నచోటు చూసి విశ్రమించాలి," అన్నాడు.

"పాములు కరవడం తక్కువ ప్రమాదం అంటావా?" అన్నాడు మొదటి బాటసారి హేళనగా.

"నేననేది అదికాదు. ఆ పుట్ట పాముల పుట్టకాదని, నా ఉద్దేశం!" అన్నాడు మూడో బాటసారి.

"బహు బాగా చెప్పావు. కంటికి అలా పాముల పుట్ట కనబడుతూంటే, కాదంటా వేమిటి? ఈ అద్వైతం ఎప్పుడు నేర్చావు?" అన్నాడు కసురుతూ మొదటి బాటసారి.

ఆ మాటలకు మూడో బాటసారి చిన్నగా నవ్వి, "శాంతం! శాంతం! నే చెప్పేది విను. ప్రతి పుట్టలోనూ పాములుండవనేది అను భవజ్ఞానం. అది తప్పక చీమలపుట్ట అయి వుంటుంది!" అన్నాడు.

ఈ జవాబుకు రెండవ బాటసారి ఆశ్చ ర్యపోతూ, "ఏమిటేమిటి! అది పాముల పుట్ట కాదని ఎలా చెప్పగలవు?" అని ప్రశ్నించాడు.

"ఐతే వినండి! ఆ పుట్ట వున్న చెట్టుపైన ఎన్నో పక్షులు గూళ్ళు కట్టాయి. అవికూడా మనలాగే ముందు రక్షణ చూసుకుంటాయి. ప్రకృతిలో ప్రతి ప్రాణికీ ప్రాణభయం ఉంటుంది కదా! అది నిజంగానే పాముల పుట్ట అయితే, ఆ చెట్టుమీద పక్షులు గూళ్ళుకట్టి పిల్లలను పొదగవు!" అంటూ మూడో బాటసారి సంచీ లోంచి దుప్పటి తీసి నేలమీద పరిచి పడు కున్నాడు.

ఈ జరిగిన సంభాషణ అంతా శివానంద స్వామితోపాటు ముగ్గురు శిష్యులూ విన్నారు. ఆయన తన కొత్త శిష్యుడితో, "నీకు ఆ ముగ్గురు బాటసారుల్లో ఎవడు జ్ఞాని, అజ్ఞాని, మూర్ఖుడు అన్న విషయం అర్థ మైందనుకుంటాను," అన్నాడు.

"అర్థంకాలేదు స్వామీ!" అన్నాడు విన యంగా శిష్యుడు.

తర్వాత, ఆయన మిగతా ఇద్దరు శిష్యుల కేసి తిరిగి, "ఆ సంగతి మీకైనా అర్థమైందా?" అని అడిగాడు.

వాళ్ళూ అర్థం కాలేదని తలలూపారు.

అప్పుడు శివానందస్వామి, వాళ్ళకు ఇలా వివరించి చెప్పాడు: "పాములొస్తే చంప వచ్చు, ఇంతమందిమి లేమా? అన్నవాడు మూర్ఖుడు. నిద్రలో వున్నప్పుడు పాము కాటువేస్తే, ఎంత మందివున్నా నిష్ప్రయోజనం. ఇంకాస్త ముందుకు పోయి మంచి చోటు చూసుకుని పడుకుంటానన్నవాడు, అజ్ఞాని. అసలు ప్రమాదం వున్నదో లేదో, ఒకవేళ వుంటే, ఆ ప్రమాదం ఏపాటిదో అని తర్కించ లేనివాడు! ఇక, జ్ఞాని ఎవరో మీరు గ్రహించే వుంటారు. ఉన్న పరిస్థితిని అంచనా వేస్తూ, మేలు-కీడులను వితర్కించి ప్రమాద పరి స్థితులను అధిగ మించేవాడు, జ్ఞాని. మీరు కూడా, ఆ జ్ఞానిలాగా మీమీ శాస్త్రజ్ఞానానికి లౌకిక, వ్యవహారజ్ఞానాలను మేళవించగలి గితే, జీవితం ఏ ఒడిదుడుకులూ లేకుండా సుఖప్రదంగా సాగిపోతుంది!"





# స్వర్గప్రాప్తి

ఒక మనిషి భార్యా పిల్లలతో లౌకికజీవితం పూర్తిగా అనుభవించి, ఉత్తమలోకాలు సంపాదించుకోవాలన్న కోరిక పుట్టి, తపస్సు చెయ్యసాగాడు.

మరొక మనిషి ప్రపంచం మీద విరక్తి పుట్టి, అడవి చేరుకున్నాడు.

అక్కడ మొదటివాడు అతడికి కనిపించాడు.

ఆ తపస్సు చేసుకునే వాడికి సేవచేసి, అతనితోబాటు తానుకూడా స్వర్గం సంపాదించుకోవచ్చుననుకుని రెండోవాడు మొదటి వాడితో, ''స్వామీ, మీ శిష్యుడిగా నన్ను స్వీకరించండి,'' అన్నాడు.

''నాకు ఎవరి సేవా అక్కర్లేదు. నన్ను పలకరించకు,'' అని మొదటి తపస్వి కళ్ళు మూసుకున్నాడు.

''ఈ మహాతపస్వికి తపోభంగం కలగకుండా చూడటమే గొప్ప పుణ్యం,'' అనుకుని రెండోవాడు కొద్దిదూరంలో తానుకూడా తపస్సు చెయ్యటానికి కూర్చున్నాడు.

అలా తపస్సు చేసుకుంటూనే రెండోవాడు మొదటివాడి తపస్సుకు ఏ పశువులూ, పక్షులూ భంగం కలిగించకుండా చూస్తూ, సమీపంలోకి వచ్చిన వాటిని దూరంగా తరిమేవాడు.

మొదటి తపస్వి రెండోవాడి గొడవే పట్టించుకోకుండా తన గాఢతపస్సులో తాను నిమగ్నుడయ్యాడు.

ఇలా ఉండగా, బట్టలుతికేవాడు ఒకడు ఇద్దరు మనుషులూ తపస్సు చేసుకునే ప్రాంతంలో మంచి సరస్సు ఉండటం చూసి అక్కడ బట్టలు ఉతకసాగాడు.

వాడు బట్టలు ధపా ధపా ఉతుకుతూ ఉంటే తపస్వులిద్దరికీ భంగం కలిగింది. మొదటివాడు కళ్ళు తెరిచి, బట్టలుతికేవాణ్ణి చూసి, కొంచెం చీకాకుపడ్డాడు. వాణ్ణి దూరంగా వెళ్ళి బట్టలుతుక్కోమని చెబుదామా అని అతను అనుకుని కూడా, అలా చెయ్యరాదని తీర్మానించుకుని, యధాప్రకారం

కళ్ళు మూసుకుని తిరిగి తపస్సమాధిలోకి వెళ్ళిపోయాడు.

కాని, రెండో తపస్వి పట్టరాని కోపంతో లేచిపోయి, వాణ్ణి, "ఒరే, నీకు బుద్ధి ఉందా? నీ ఉతుకుడుతో తపోభంగం చేస్తావా? వెంటనే ఇక్కడి నుంచి దూరంగా వెళ్ళిపో," అని గట్టిగా కసిరాడు.

"పో పోవయ్యా! నీ తపస్సుతో నాకేం పని? నీ తపస్సు నా కుటుంబం పొట్టనింపు తుందా?" అని నిర్లక్ష్యంగా జవాబు చెప్పి, వాడు తన పని సాగించాడు.

రెండో తపస్వి ప్రతిరోజూ వాడితో ఘర్షణ పడుతూ వచ్చాడు. వాడు మాత్రం రేవు వదలిపోలేదు.

కొంత కాలానికి ఆ బట్టలుతికేవాడు చచ్చాడు; రెండో తపస్వి కూడా చచ్చాడు. మరికొంత కాలానికి మొదటి తపస్వి దేహం చాలించి స్వర్గానికి పోతూండగా, రెండో తపస్వి నరకంలో బాధలు పడుతూ అతన్ని చూసి, "అయ్యా, నన్ను కూడా మీతోపాటు స్వర్గానికి తీసుకుపొండి. నేను మీకు ఎంతో సేవచేసిన వాణ్ణి కానా?" అన్నాడు.

తరవాత మొదటి తపస్వి స్వర్గం చేరు కున్నాడు. అక్కడ అతనికి స్వర్గసుఖాలు అనుభవిస్తున్న బట్టలుతికేవాడు కనిపిం చాడు. అది చూసి అతను తన వెంట ఉన్న దేవదూతతో, "నాతోబాటు తపస్సు చేసిన వాడు నరకంలో ఉండటం ఏమిటి? మాకు రోజు తప్పకుండా తపోభంగం కలిగించిన ఈ బట్టలుతికేవాడు స్వర్గంలో ఉండటం ఏమిటి? ఇది నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నది," అన్నాడు.

దానికి దేవదూత, "ఈ బట్టలుతికేవాడు నీ తపస్సు శీఘ్రంగా ఫలించటానికి తోడ్ప డ్డాడు. అతను చేసిన చప్పుడు కారణంగా నువ్వు మరింత ఏకాగ్రత సాధించగలిగావు. అతడు తన ధర్మం తాను నెరవేర్చాడేగాని, ఏ పాపమూ చేసినవాడు కాడు. నీ అనుచరుడు తపస్సు చెయ్యలేదు. అతనికి ఏకాగ్రత ఏమాత్రమూ కుదరలేదు. నీ తపస్సును సంరక్షిస్తున్నాననుకుని పశుపక్ష్యాదుల మీద రాళ్ళు విసరటమూ, బట్టలుతికేవాడితో ఘర్షణ పడటమూ లాటి పనులు చేశాడు," అన్నాడు.





మీ సృజనాత్మక శక్తిని ఉపయోగించండి! బహుమతులను గెలుచుకోండి!!



బాల రచయితలకూ-చిత్రకారులకూ ఆహ్వానం

# పిల్లల ప్రత్యేక సంచిక

(నవంబర్ 2002)

**బాల రచయితలకు:** చక్కని కథలను ఆలోచించి ఐదు వందల పదాలకు మించకుండా రాసి, తగిన పేరు పెట్టి పంపండి. తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం, హిందీ, బెంగాలీ, ఒరియా, మరాఠీ, గుజరాతీ, ఇంగ్లీషు భాషలలో ఏ భాషలోనైనా సరే ఒక్కొక్కరు మూడు ఎంట్రీల వరకు పంపవచ్చు. ఎంపికయిన కథలను, నవంబర్ 2002 పిల్లల ప్రత్యేక సంచికలో ప్రచురిస్తాము.

**బాల చిత్రకారులకు:** సుప్రసిద్ధ పౌరాణిక/చారిత్రక దృశ్యాల్ని (వాటి వివరణతో) చిత్రంగా/వర్ణచిత్రంగా వేసి మాకు పంపాలి. ఎంపికయిన చిత్రకారులను మా ఖర్చులతో చెన్నయ్‌కి రప్పించి, ప్రత్యేక సంచిక కోసం ఎంపికయిన బాలల రచనలకు వాళ్ళచేత చిత్రాలు వేయిస్తాం.

ఎంట్రీలు మాకు చేరవలసిన ఆఖరు తేదీ: ఆగస్ట్ 31, 2002.

**ఉత్తమ రచనలకు, చిత్రాలకు ఆకర్షణీయమైన బహుమతులు ఉంటాయి!**

ఫోటో: మీ ఎంట్రీలతోపాటు మీ పాస్‌పోర్ట్ సైజు ఫోటో ఒకటి జతచేసి పంపండి.

కింది కూపన్‌ను వివరాలతో పూర్తిచేసి, మీ ఎంట్రీకి జతచేసి **పిల్లల ప్రత్యేకసంచిక పోటీ,** చందమామ ఇండియా లిమిటెడ్, 82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్-600 097 చిరునామాకు పంపండి.

పేరు: .................................... వయసు/పుట్టిన తేదీ : ....................

తరగతి:.................. పాఠశాల : ....................................

ఇంటి చిరునామా : ....................................

....................................

.................................... పిన్‌కోడ్ : ....................

ఎంట్రీల వివరాలు :-

1. ....................................
2. ....................................
3. ....................................

పైన కనబరచిన ఎంట్రీలు, మా అబ్బాయి/అమ్మాయి స్వయంగా మరెవ్వరి సాయం లేకుండా రాసినవి/వేసినవి అని ధ్రువపరుస్తున్నాను. ఎంపికయిన ఎంట్రీలను తెలుగు భాషలోనూ, ఇతర భాషలలోనూ ప్రచురణ మరియు ఎలక్ట్రానిక్ మీడియాలో వాడుకునే పూర్తి కాపీరైట్ చందమామకే చెందుతుందని ఇందుమూలంగా సమ్మతిస్తున్నాను.

పాల్గొనే అబ్బాయి/అమ్మాయి సంతకం

తల్లి/తండ్రి సంతకం


ఇదొక చందమామ కానుక!
అజేయుడు గరుడుడు
18
చిత్రాలు: పాణి
కొండలమధ్య గుహాలయంలో తాంత్రికుడు నాగబంధు తలపెట్టిన యజ్ఞానికి విఘ్నం కలిగింది. శత్రుశక్తులు తన పథకాలకు ఆటంకం కలిగిస్తున్నట్టు నాగబంధు అనుమానించాడు. తాంత్రికుడి నోటవెంట 'గరుడుడు' అనే పేరు వినగానే నరేంద్రదేవుడు దిగ్భ్రాంతి చెందాడు. నరేంద్రదేవుణ్ణి గుహాలయంలోనే ఉండమనీ, అతడి కుమారుడు రవీంద్రదేవుణ్ణి వెంటబెట్టుకు రమ్మని భూతవైద్యుణ్ణి పంపాడు.


ఆదిత్యుణ్ణి వెతుక్కుంటూ వచ్చిన రవీంద్రదేవుణ్ణి, భూతవైద్యుడు చాందినీ నదీతీరంలోని సైనిక శిబిరంలో కలుసుకున్నాడు.
ప్రస్తుతానికి ఆదిత్యుణ్ణి గురించి మరిచిపో. నీకేదో అపాయం ఉందని తంత్రవేత్త హెచ్చరించాడు. కాబట్టి నువ్వు వెంటనే నీ తండ్రిగారు ఉన్న గుహాలయానికి చేరుకోవాలి.
అలాగా! నేను చంద్రపురి రాజు కావడానికి ఆదిత్యుడు పెద్ద అవరోధంగా దాపురించాడు. సరే... నువ్వు చెప్పినట్టే చేస్తాను.


కొండలమధ్య ఉన్న గుహాలయానికి బయలుదేరడానికి ఏర్పాట్లు చేయండి.
మీలో కొందరు రాజధానికి తిరిగివెళ్ళండి ఆదిత్యుడు రాజధానికి తిరిగివచ్చినట్టయితే, వాణ్ణి రాజభవనంలో ప్రవేశించకుండా అడ్డుకోండి!


అక్కడ ఆదిత్యుడు నూతన జననివాస స్థావరాన్ని చేరుకున్నాడు. ప్రజలు అతనికి ఘనస్వాగతం పలికారు.
నేను మీకొక శుభవార్త తెచ్చాను!
మంత్రిగారికి స్వాగతం! సుస్వాగతం!
ఆహా! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు వచ్చారు!
మనరాజుగారు రాజధానికి తిరుగుప్రయాణంలో ఉన్నారు. వీరబాహు ఆయనకు రక్షణగా వస్తున్నాడు. రాజుగారిని పదవి నుంచి తొలగించడానికి నరేంద్రదేవుడూ, అతని కొడుకూ కుట్ర పన్నుతున్నారు. ఆ దుర్మార్గులనుంచి రాజుగారిని మనం రక్షించాలి.


అక్కడున్న యువకులకు ఆదిత్యుడు ప్రత్యేక సూచనలిచ్చాడు.
రాజభవనంలోని ద్రోహుల, అవకాశవాదుల ఆటకట్టించాలి. మొదట రాజుగారు క్షేమంగా రాజభవనం చేరేలా చూడాలి.
మహారాజుగారి కోసం, రాజ్యం కోసం మా ప్రాణాలను త్యాగం చేయడానికి సిద్ధంగా ఉన్నాం.


ఆదిత్యుడి వెంట వెళ్ళడానికి కొందరు యువకులు సిద్ధమయ్యారు..
...మరికొందరు రాజు ప్రయాణమై వస్తున్న మార్గంలో కాపు కాస్తూ భద్రత కల్పించడానికి సన్నద్ధులయ్యారు.


ఆదిత్యుడు యువకుల దండుతో రాజధానిలోని కోటను సమీపించాడు.
ఆగండి! నే చెప్పేది జాగ్రత్తగా వినండి.
విశ్వాసపాత్రులైన కాపలాభటులందరినీ రాజభవనం నుంచి తరిమేశారు. మనం ఇప్పుడు రాజభవనం నుంచి వెలుపలికి వెళ్ళే మార్గాలన్నిటినీ చుట్టుముట్టి మూసివేయాలి!


రాజభవనానికి వెళ్ళి, తమ సందేశాన్ని రవీంద్రదేవుడికి అందజేయడానికి ఆదిత్యుడు కొందరు యువకులను ఎంపికచేశాడు.
ఎలాంటి ఎదురుదాడులకైనా సిద్ధంగా వెళ్ళండి!
మేము ఎలాగైనా రాజభవనంలో ప్రవేశించగలం!
కొంతసేపటికి ఆ యువకుల నాయకుడు, భవన కాపలాభటుల నాయకుణ్ణి వెంటబెట్టుకుని వచ్చాడు.
అయ్యా! సేనాధిపతీ, అతని కుమారుడూ ఇద్దరూ రాజధానిలో లేరు!
అలాగా! అయితే మీరందరూ ఈక్షణమే


లొంగిపోయి, కోటను వదిలి వెళ్ళిపోవాలి!
భవన కాపలాభటుల నాయకుడు లోపలికి వెళ్ళి, తిరిగివచ్చాడు.
మా భటులలో అధికులు ఆయుధాలు అప్పగించడానికి సమ్మతించారు.
ఎదురుతిరిగి వ్యతిరేకించినవాళ్ళందరినీ ఆదిత్యుడి సహచరులు లొంగదీసుకుని బంధించారు.
-ఇంకావుంది

# వినోద సమయం

## ఒక బొమ్మలో వినోదాలు ఎన్నో ...

చిత్రం ఒక్కటేకాని ఇందులో చాలా పనులు చేయవచ్చు.
మొదట చిత్రానికి రంగులు వేయండి. ఆ తరవాత చీమబొమ్మలో ఉన్న తప్పేమిటో పరిశీలించి కనిపెట్టండి. చివరగా ఇక్కడి రెక్కల పురుగుల్లో (బీటిల్స్) రెండు ఒకే విధంగా ఉన్నాయి. అవి ఏవో కనుగొనండి.



## ఒకే గీతతో..



హంస చాలా అందంగా ఉంది కదూ? ఆ బొమ్మ గురించిన విశేషం ఏమిటో తెలుసా? కాగితం మీద పెట్టిన పెన్సిల్‌ను తీయకుండా ఒకే గీతతో వేసిన హంసబొమ్మ ఇది. మీరూ ప్రయత్నించి చూడండి మరి!

## చీమ బొమ్మ

మీరూ
చిత్రకారులు
కావాలనుకుంటున్నారా?
ఇక్కడ ఇచ్చిన సులభమైన
సూచనలను పాటిస్తూ క్రమ క్రమంగా
గీసుకుంటూ వెళ్ళండి. చీమ బొమ్మ
తయారవుతుంది!







## తమాషా తాతయ్య

తాతయ్యకు పొడవాటి గుబురు
గడ్డం ఉంది, అవునా?
గడ్డాన్ని పరిశీలించి చూడండి.
దాని లోపల ఎన్నో ప్రాణులు
దాగి ఉండడం తెలియ
వస్తుంది. వాటిలో మీరు
ఎన్నిటిని కనుగొనగలరో
వెతికి చూడండి!

(సమాధానాలు 70 పేజీ)



వ్యాఖ్యలు రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ





ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు అక్టోబర్ 2002 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.

## అభినందనలు

జూన్ నెల 2002 సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు:

యన్. పార్థసారథి
II ఇంటర్, (బై పి సి)
వికాస్ జూనియర్ కాలేజీ
రింగ్‌రోడ్, గుంటూరు. (ఆం.ప్ర)

బహుమతి పొందిన వ్యాఖ్యలు





మొదటి ఫోటో: సాంస్కృతిక శిల్పాలతో ఆట!
రెండవ ఫోటో: సాంకేతిక పరిజ్ఞానానికే బాట!!

వినోద సమయం- సమాధానాలు (పేజీ 64)



తమాషా తాతయ్య

ఒక బొమ్మలో వినోదాలు ఎన్నో ...

చీమకు ఒక కాలు లేదు



Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

